# పద్య మంజరి





సంపాదకుడు - వ్యాఖ్యాత

**వి. బందా** *M.A. Litt., B.L.I.Sc., L.M.E.,*

# పద్యమంజరి

**వి. బందా**

ప్రథమ ముద్రణ
మార్చి 2003
ప్రతులు : 1000

డైరెక్టర్ ఆఫ్ పబ్లికేషన్
టి. రామచంద్రరావు

వెల. 20/-లు

ప్రతులకు
**భారతీ రాధ పబ్లికేషన్స్**
C/o. టి. రామచంద్రరావు
1-158, విద్యావికాస్ ప్రక్క
సత్రంపాడు, ఏలూరు - 534 007
ప॥ గో॥ జిల్లా - ఆం.ప్ర.

డిటిపి, ముద్రణ :
ఏలూరు ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఏలూరు.
ఫోన్ : 244543

# ఒక్క క్షణం ......

నేను పుట్టింది పల్లెటూరిలో. ప్రాధమిక విద్యాభ్యాసం చెసింది ఎలిమెంటరీ స్కూల్లో. హైస్కూలు చదువులు జల్లా పరిషత్ పాఠశాలల్లో. ఆ రోజుల్లో తెలుగు పద్యాలు చచ్చినట్లు చదివి కంఠోపాఠం చేసేవాళ్ళం. కానీ ఈ కాలంలో ఇంగ్లీషు చదువుల బాలబాలికలకు తెలుగు పద్యాలు అసలు రావంటే అతిశయోక్తి కాదేమో!

పెద్దవాళ్ళు శ్రద్ధగా మాతో శతక పద్యాలు ఆ రోజుల్లో చదివించే వారు. ఈ మధ్య అటువంటి పద్యాలే పాఠశాలల్లో చెప్పటం లేదని పెద్దలు వాపోతుండటం నాకు తెలుసు. అందుకే ఆంధ్ర బాలబాలికలకు కొన్ని పద్యాల పరిచయమైనా ఉంటుందని, తెలుగు భాషపట్ల ఆసక్తి ఉన్నవారిని దృష్టిలో పెట్టుకొని కొన్ని ప్రసిద్ధ శతక పద్యాలను, భారత భాగవత పద్యాలను ప్రోదిచేసి భావంతో మీ ముందుంచుతున్నాను.

సుమధుర పద్య సంపద కొంతవరకు ఇక మీ సొత్తవుతుంది. తెలుగు పాఠకులు ఈ మా యత్నాన్ని ఆదరిస్తారని త్రిశుద్ధిగా నమ్ముతూ

మీ వంతు ప్రోత్సాహానికి ఎదురుచూస్తూ .....

మీ

**వి. బందా**

మా శ్రేయోభిలాషి, హితైషి, స్ఫూర్తిదాయక మిత్రులు

“భారతజ్యోతి” పురస్కార గ్రహీత

ఏలూరు శ్రీశ్రీ విద్యాసంస్థల అధినేత

**శ్రీ ఎం.బి.ఎస్.** శర్మగారికి

స్నేహపురస్సర కానుకగా....

**– [illegible]**

# సుమతీ శతకము

**అక్కఱకు రాని చుట్టము**
**మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమున దా**
**నెక్కిన బారని గుఱ్ఱము**
**గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ!**

**భా.** అవసరమునకు పనికిరాని చుట్టమును, నమస్కరించి వేడిననూ కోరిక నెరవేర్చని భగవంతుని, యుద్ధ సమయమున ఎక్కినపుడు ముందుకు పరుగెత్తని గుఱ్ఱమును వెంటనే విడిచిపెట్టవలయును.

**అప్పిచ్చువాడు వైద్యుడు**
**నెప్పుడు నెడతెగక బాఱునేఱును, ద్విజుడన్**
**జొప్పడిన యూర నుండుము**
**చొప్పడ కున్నట్టియూరు జొరకుము సుమతీ!**

**భా.** ఋణము నిచ్చువాడును, వైద్యుడును, ఎల్లప్పుడును ఆగకుండ ప్రవహించు నదియును, బ్రాహ్మణుడును గల గ్రామమందే నివసింపుము. వారులేనట్టి గ్రామమందు నివసించవద్దు.

**ఉపకారికి నుపకారము**
**విపరీతము గాదుసేయ వివరింపంగా**
**నపకారికి నుపకారము**
**నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!**

**భా.** మేలుచేసిన వానికి తిరిగి మేలు చేయుట గొప్పకాదు. హానిచేసిన వానికి లోగడవాడు చేసిన దోషములు లెక్కచేయక ఉపకారము చేయువాడే నేర్పు గలవాడు.

**ఎప్పుడు సంపద కలిగిన**
**నప్పుడె బంధువులు వత్తురది యెట్లన్నన్**
**దెప్పలుగ జెరువు నిండిన**
**గప్పలు పదివేలు చేరు గదరా సుమతీ!**

**భా.** చెరువు నిండా నీరు చేరగానే వేలకొలది కప్పలు అందులోనికి ఏ విధముగా చేరుకొనునో సంపద కలిగిన బంధువులెక్కువగా జేరుకొందురు.

**కనకపు సింహాసనమున**
**శునకమున్ గూర్చుండ బెట్టి శుభలగ్నమునన్**
**దొనరగ బట్టము గట్టిన**
**వెనుకటి గుణమేల మాను వినరా సుమతీ!**

**భా.** కుక్కను తీసుకుని వచ్చి మంచి ముహూర్తమునందు బంగారు గద్దెమీద కూర్చుండబెట్టి పట్టాభిషేకము చేసినప్పటికీ దాని నైజ గుణము నేలాగున మానలేదో ఆ విధముగానే అల్పుడైన వానికి ఎంత గౌరవము చేసి మంచి పదవొసంగినను తన నీచత్వమును వదలనేరడు.

**కులకాంత తోడ నెప్పుడు**
**గలహింపకు వట్టి తప్పు ఘటియింపకుమీ**
**కల కంఠి కంట కన్నీ**
**రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ!**

**భా.** భార్యతోడ నెప్పుడును జగడములాడరాదు. లేని నేరములను ఆరోపించరాదు. ఉత్తమ ఇల్లాలి యొక్క కంటినీరు క్రింద పడినచో ఆ యింటి యందు లక్ష్మి నిలవదు.

కూరిమిగల దినములలో
నేరము లెన్నడును గలుగ నేరవు మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోచుచుండు నిక్కము సుమతీ!

**భా.** పరస్పరము స్నేహమున్న రోజులలో నేరము లెప్పుడును కన్పించవు. ఆ స్నేహము చెడిపోగానే అన్నియును తప్పులుగానే కనబడు చుండును. ఇది నిజము.

చీమలు పెట్టిన పుట్టలు
పాములు కిరవైన యట్లు పామరుడు దగన్
హేమంబు గూడ బెట్టిన
భూమీశులపాల జేరు భువిలో సుమతీ!

**భా.** చీమలు పెట్టినటువంటి పుట్టలు పాములకు నివాసమైనట్లు అజ్ఞాని కూడబెట్టిన బంగార మంతయు రాజుల వశమై పోవును.

తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

**భా.** తన కోపమే తన్ను శత్రువువలె బాధించును. తన శాంతమే తనను రక్షించును. తన దయయే తనకు చుట్టమువలె సహాయపడును. తన ఆనందమే తనకు ఇంద్రలోక సౌఖ్యము. తన దుఃఖమే తనకు నరకమగును. ఇది నిజము.

తలనుండు విషము ఫణికిని
వెలయంగా దోకనుండు వృశ్చికమునకున్
దలదోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

**భా.** పామునకు విషము తలయందుండును. తేలునకు తోకయందు ఉండును. దుష్టునకు విషము తల తోక యనకుండ శరీరమందంతటనూ ఉండును.

# వేమన శతకము

తప్పులెన్నువారు తండోప తండము
లుర్వి జనులకెల్ల నుండు దప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ!

**భా.** లోకములో తప్పు చెయ్యని వారుండరు. అయినను ఇతరుల తప్పు లెన్నువారు లెక్కలేనంత మంది ఉంటారు. వారు తమ తప్పుల నెరుగరు.

ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా!

**భా.** ధన మధికమైన గర్వమధికమగును. దుర్గుణము హెచ్చును. ధనము లేనిచో మదము, దానినిబట్టి దుర్గుణము నశించును.

పదుగురాడు మాట పాడియై ధరజెల్లు
నొక్కడాడు మాట యెక్కదెందు
ఊఱకుండువాని కూరెల్లునోపదు
విశ్వదాభిరామ వినురవేమ!

**భా.** పదిమంది చెప్పిన మాట అసత్యమైనను దానినే నమ్ముదురు. ఒక్కడు సత్యమే చెప్పినను దానిని నమ్మరు. వాదులాట జరిగిన స్థితిలో ఊరక యున్నవాడే ఉత్తముడు.

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్టవిప్పి చూడ పురుగులుండు
పిరికివాని మదిని బింక మీ లాగురా
విశ్వదాభిరామ వినురవేమ!

**భా.** మేడిపండు చూచుటకు అందముగా నుండును. కాని పొట్ట విప్పి చూచినచో ఎన్నో పురుగులుండును. అట్లే పిరికివాడు బయటికి బాగుగా కనబడతాడు. బింకము మాత్రము సున్న.

అన్ని దానములను నన్నదానమె గొప్ప
కన్నవారికంటె ఘనులు లేరు
ఎన్న గురునికన్న నెక్కువ లేరయా
విశ్వదాభిరామ వినురవేమా!

**భా.** అన్ని దానములలో అన్నదానమే గొప్పది. ఉత్తములలో తల్లిదండ్రులే అధికులు. అదే రీతిలో ఉత్తముడగు గురువు కంటె గొప్పవారు లోకమున లేరు.

**గంగి గోవుపాలు గరిటెడైనను చాలు**
**కడవడైననేమి ఖరము పాలు?**
**భక్తిగల్గుకూడు పట్టెడైనను చాలు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భా.** ఆవుపాలు కొంచెము లభించిననూ మేలే. గాడిదపాలు కుండెడైననూ ప్రయోజనము లేదు. ప్రేమతో పెట్టిన తిండి పట్టెడైన తృప్తినిచ్చును. తిట్టుచు ఎంత పెట్టినను తృప్తియుండదు.

**ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?**
**భాండ శుద్ధిలేని పాకమేల?**
**చిత్త శుద్ధిలేని శివపూజ లేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భా.** దాంభికులు మనశ్శుద్ధి లేకయే పేరునకు శివపూజలు చేస్తుంటారు. అట్టి పూజలు వ్యర్థములు. ఆత్మ శుద్ధిలేని ఆచారము, శుద్ధము చేయని పాత్రలలో వండిన వంటయు గూడ నిరపయోగములే!

**జాతులందు మిగుల జాతియే దెక్కువో?**
**యెఱుకలేక తిరుగనేమి ఫలము?**
**యెఱుక కలుగవాడె యెచ్చైన కులజుడు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భా.** జాతులలో ఒకటి యెక్కువ మరియొకటి తక్కువ కాదు. జ్ఞానము లేక కులమును పట్టుకొని తిరిగిన ప్రయోజనము లేదు. ఎవ్వడు జ్ఞానవంతుడో అతడే గొప్ప కులమువాడు. కులముకన్న జ్ఞానమే గొప్పది.

**ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు**
**జూడచూడ రుచుల జాడవేఱు**
**పురుషులందు బుణ్యపురుషులు వేరయా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా. ఉప్పు - కర్పూరము - రెండును తెల్లగా ఒక్క రీతిగానే కనబడతాయి. కాని వాని రుచులు వేర్వేరుగా ఉంటాయి. అట్లాగే అందరూ ఒక మాదిరి గానే కన్పిస్తారు. కాని వారి వారి గుణములను బట్టి పుణ్యాత్ములెవరో చెడ్డవారెవరో తెలిసిపోతుంది.

**వెఱ్ఱివాని మిగుల విసిగింపగా రాదు**
**వెఱ్ఱివాని మాట వినగరాదు**
**వెఱ్ఱి కుక్క బట్టి వేటాడగా రాదు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా. మూర్ఖునితో చర్చించి విసిగింపకూడదు. వెఱ్ఱివాని మాటను లెక్కచేయ కూడదు. వెఱ్ఱి కుక్క సహాయముతో వేటకు పోగూడదు.

**బహుళ కార్యములను బరికింపగా వచ్చు**
**బహుళ శబ్ద చయము బలుక వచ్చు**
**సహన మొక్కటబ్బ జాల కష్టంబురా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా. ఎన్ని కావ్యములు చదివిననూ, ఎన్ని శబ్దములను చర్చించిననూ సహన గుణము అలవడుట కష్టము. అది కలవాడే విద్వాంసుడు.

ధనము లేకయున్న ధైర్యంబు చిక్కదు
ధైర్యమొదవడదేని ధనమొదవదు
ధనము ధైర్యమరియదగు భూమి నరులకు
విశ్వదాభిరామ వినురవేమ!

భా. ధనము లేనిచో ధైర్యముండదు. ధైర్యము లేనిచో ధనమురాదు. కావున ధన, ధైర్యములు రెండునూ ఉండవలెను.

అల్పుడెపుడు పల్కు నాడంబరము గాను
సజ్జనుండు పల్కు జల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబుమ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ!

భా. దుష్టుడు ఆర్భాటముగా మాటలాడును. మంచివాడు మెల్లగా పలుకును. కంచు కంగున ధ్వనిచేయును. బంగారము ధ్వనింపదు.

అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్ల తొలగగొట్టు
చెప్పుతినెడి కుక్క చెఱకు తీపెరుగునా
విశ్వదాభిరామ వినురవేమ!

భా. దుష్టుడు అధికారి యైన యెడల, వాడు మంచి వారిని తరమి వేయును. చెప్పు తిను కుక్కకు చెరకు రుచి ఏమి తెలియును? తెలియదు.

అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచెముండుటెల్ల గొదువకాదు
కొండ యద్దమందు గొంచమై యుండదా
విశ్వదాభిరామ వినురవేమ!

భా. తగనిచోట సజ్జనులు తాము గొప్పవారమని చెప్పరాదు. కొంచెపు వారైన మాత్రాన హానిలేదు. పెద్దకొండ అద్దములో చిన్నదిగా కానవచ్చును గదా!

**ఓర్పులేని భార్యయున్న ఫలంబేమి?**
**బుద్ధిలేని బిడ్డ పుట్టియేమి?**
**సద్గుణంబులేని చదువది యేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా. ఓర్పులేని భార్య, బుద్ధిలేని పుత్రుడు, గుణములేని చదువు నిరపయోగములు.

# కృష్ణ శతకము

దండవయా విశ్వంభర
దండమయా పుండరీక దళనేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకు నెపుడు దండము కృష్ణా !

భా. లోకమును భరించినవాడా! తామర రేకుల వంటి కన్నులు గలవాడా! పాపములను హరించినవాడా! కృష్ణా నీకు దండమయా!

నీ నామము భవహరణము
నీ నామము సర్వ సౌఖ్య నివహా కరంబు
నీ నామ మమృత పూర్ణము
నీ నామమునే దలంతు నిత్యము కృష్ణా !

భా. ఓ కృష్ణా! నీ నామమ్ముచ్చరించిన సంసార దుఃఖములు తొలగిపోయి సర్వ సౌఖ్యములనిచ్చును. నీ నామామృతముతో సర్వము నిండి పోయినది. ఎల్లప్పుడు నీ నామమునే స్మరింతును.

నీవే తల్లివి దండ్రివి
నీవే నాతోడు నీడ నీవే సఖుడా
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా !

భా. ఓ కృష్ణా! నాకు తల్లి, తండ్రి, సహాయము, స్నేహితుడు, గురువు, దేవుడు, ప్రభువు, గతి సమస్తము నిజముగా నీవేయైయున్నావు.

హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా
హరి నీనామ మహాత్మ్యము
హరిహరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా!

భా. హరియని రెండక్షరములు కలిసి హరియని నీపేరై పాపములను బోగొట్టుచున్నవి. ఓ పరమేశ్వరా! కృష్ణా! నీ నామ మహిమను ఎవ్వరును పొగడలేరు.

వేదంబులు గన నేరవి
యాది పరబ్రహ్మమూర్తి వనఘ మురారీ
నా దిక్కు జూచి కావుము
నీ దిక్కే నమ్మినాడ నిజముగ కృష్ణా!

భా. ఓ కృష్ణా! నీవు వేదాంతములకు గూడ అతీతుడవు. నాకు నీవే దిక్కని నమ్ముకొని యుంటిని. నీ చల్లని చూపులు నాపై జూపి రక్షింపుము.

పాణితలంబున వెన్నయు
వేణీ మూలంబునందు వెలయగ పింఛం
బాణీ ముత్యము ముక్కున
నాణెముగా దాల్చు లోకనాథుడ కృష్ణా!

భా. ఓ కృష్ణా! నీవు లోకములకెల్ల ప్రభుడవయ్యును చేతిలో వెన్న ముద్దయు, సిగలో నెమలి పింఛమును ముక్కున ఆణిముత్యమును ధరించి పసిబాలునివలె నుంటివి గదా!

మడుగుకు జని కాళీయుని
పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్
గడు వేడుకలో నాడెడు
నడుగులు నా మదిని దలతు నచ్యుత కృష్ణా!

భా. కృష్ణా! మహా భయంకరుడయి జనులను బాధించు కాళీయుడను పాము పడగలపై భయము లేకుండ నాట్యమాడి వానిని హతమార్చిన నీ పాదములను నా మనస్సులో స్మరింతును.

గిరులందు మేరువౌదువు
సురలందున నింద్రుడౌదు చుక్కల లోలన్
బరమాత్మ చంద్రుడౌదువు
నరులందున నృపతివౌదు నయముగ కృష్ణా !

భా. ఓ కృష్ణా! నీవు కొండలలో మేరువవు. దేవతలలో ఇంద్రుడవు. చుక్కలలో చంద్రుడవు. మనుష్యులలో పాలకుడవగు రాజువు.

విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపదలచిన విష్ణుడ వనగా
విశ్వము జెరుపను హరుడవు
విశ్వాత్మక నీవెయగుదు వెలయగ కృష్ణా!

భా. కృష్ణా! లోకములన్నింటిని పుట్టించు బ్రహ్మవు నీవే! వానిని రక్షించు విష్ణుడవు నీవే! వానిని సంహరించు ఈశ్వరుడవు నీవేయగుచున్నావు. నీవొక్కడివే యేపని చేయుచున్నప్పుడా పేరున పిలువబడుచున్నావు.

వడుగున్డవై మూడడుగుల

నడిగితివౌ భళిర, భళిర, యఖిల జగంబుల్
తొడిగితివి నీదు మేనున
గడు చిత్రము నీ చరిత్ర ఘనమవు కృష్ణా!

భా. నీవు వామనావతారమెత్తి బలి చక్రవర్తిని మూడడుగుల నేలనిమ్మని యడిగి లోకములన్నిటిని రెండడుగుల నాక్రమించి మూడవ యడుగున నతని బాతాళమునకు ద్రొక్కిన నీ చరిత్ర చాల అద్భుతమైనది.

# దాశరథీ శతకము

అంచితమైన నీదు కరుణామృత సారము నాదుపైని బ్రో
క్షించిన జాలు దాన నిరసించెద నా దురితంబులెల్ల దూ
లించెద వైరి వర్గమెడ లించెద గోర్కుల నీదు బంటనై
దంచెద గాలకింకరుల దాశరథీ కరుణాపయోనిధీ!

భా. రామా! ఒప్పిదమైన నీ దయామృత సారమును నామీద చల్లిన చాలును. దానిచేతనే నా పాపములను దూలించి, అంతశ్శత్రువులైన ఇంద్రియములను చిక్కబట్టి రాగద్వేషములను వదలి, నీదాసుడనై యమ కింకరులు వచ్చిరేని కొట్టి తఱిమెదను.

**వలదు పరాకు భక్తజన వత్సల నీ చరితంబు వమ్ముగా**
**వలదుపరాకు నీ బిరుదు వజ్రము వంటిది కావకూరకే**
**వలదు పరాకు నా దురిత వార్ధికి దెప్పవుగా మనంబులో**
**దలతుమెకా నిరంతరము దాశరధీ కరుణాపరయోనిధీ!**

భా. భక్తులయందు దయగల రామా! ఆశ్రిత రక్షణాదులు దెలుపు నీ చరితములును, ఆశ్రిత రక్షకుండవని వజ్రమువలె అభేద్యమైన నీ బిరుదును వ్యర్థమగును. అట్లు చేయవలదు. జాగ్రత్త రామా! నిన్ను సముద్రమును దాటించు తెప్పవలె నా పాపములను పోగొట్టు వానినిగా మనస్సులో ఎప్పుడునూ తలపోయుదును.

**శ్రీరమ సీతగాగ, నిజసేవక బృందము వీరవైష్ణవా**
**చార జనంబు గాగ విరజానది గౌతమిగా వికుంఠము**
**న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాగ, వశించు చేతనో**
**ద్ధారకుడైన విష్ణుడవు దాశరధీ కరుణాపయోనిధీ**

భా. దశరధ రామా! నీవు పరమ పదమందున్న లక్ష్మీదేవిని ఇచట సీతగా జేసికొని, అందలి పరివారము ఇచ్చట వీరవైష్ణవ జనులుగా వచ్చి కొలుచుచుండగా, అచటి విరజానది ఇచట గోదావరిగా ప్రవహింపగా, ఆ వైకుంఠమే యిచట భద్రగిరి కొమ్మ కొనయై రాణింపగా వేంచేసిన చేతనులను ఉద్ధరించుచున్న శ్రీ విష్ణు దేవుండవేగాని వేఱుకావు.

**జుఱ్ఱెద మీ కథామృతము జుఱ్ఱెద మీ పదకంజతోయమున్**
**జుఱ్ఱెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబునే**
**జుఱ్ఱెద జుఱ్ఱ జుఱ్ఱగ రుచుల్ గనువారి పదంబు గూర్పవే**
**తఱ్ఱలతోడి పొత్తిడక దాశరధీ కరుణాపయోనిధీ!**

భా. శ్రీరామా! నీ చరిత్రలనెడి యమృతమును, నీపాద తీర్థము, నీ నామము నందు స్రవించుచున్న యమృతమును జుఱ్ఱెదను. నీ చరిత్రాదుల యమృతమును జుఱ్ఱి రుచి తెలిసికొనిన మహనీయుల దివ్యగతిని నాకు గలిగింపుము. నీచులతోడి పొత్తును నాకు మాన్పుము.

**ముప్పున గాల కింకరులు ముంగిట వచ్చినవేళ, రోగముల్**
**గొప్పరమైనచో గఫము కుత్తుక నిండినవేళ బాంధవుల్**
**గప్పినవేళ, మీ స్మరణ గల్గునొ గల్గదొ నాటికిప్పుడే**
**తప్పకజేతు మీ భజన దాశరథీ కరుణాపయోనిధీ!**

భా. శ్రీరామా! ముసలితనము వచ్చి నేనున్న చోటికి యమదూతలు వచ్చినపుడు, రోగములు మిక్కిలి ముమ్మరమైనపుడును, మరణము సమీపించగా కఫము గొంతుక యందు నిండియున్నపుడును, అప్పుడు చుట్టములు చుట్టును క్రమ్ముకొని యుండగాను మిమ్ము స్మరించుట మాకు కలుగునోకలుగదో చెప్పజాలను. కనుక ఇప్పుడే తప్పక నిన్ను భజన చేసెదను.

**చక్కెరమాని వేముదిన జాలినకైవడి మానవాధముల్**
**పెక్కురు ఐక్కదైవముల వేమఱు గొల్చెద రట్ల కాదయా**
**మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవయీవలెం**
**దక్కిన మాటలేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ**

భా. హీనులైనవారు అనేకులు నిన్ను వదలి దేవతలనేకములను గొల్చెదరు. అనగా తియ్యని చక్కెరను విడిచి చేదైన వేమును దినుటకు నేర్చినట్లున్నది. ఇది సరికాదు. మ్రొక్కదగినవాడవు నీవే. మోక్షమిచ్చు వాడును నీవే!

**చిక్కని పాలపై మిసిమి జెందిన మీగడ పంచదారతో**
**మెక్కిన భంగి మీ విమల మేచకరూప సుధారసంబు నా,**
**మక్కువ పళ్ళెరంబున సమాహిత దాస్యము పేరి దోయిటన్**
**దక్కెనటంచు జుర్రెదను దాశరథీ కరుణాపయోనిధీ!**

భా. చిక్కని పాలమీద మిసమిసలాడు మీగడను చక్కెరతో గలిపి తినునట్లు మిక్కిలి అమృతమువలె నుండు నీ చల్లని రూపమును నేను ప్రేమతో గైకొని దాస్యరూపమైన కైంకర్యము అవ్వారిగా చేసి అనుభవించెదను.

**భండన భీముడార్తజన బాంధవుడుజ్జ్వల బాణతూణ కో**
**దండ కళాప్రచండ భుజతాండవకీర్తికి రామమూర్తికిన్**
**రెండవసాటి దైవమిక లేడనుచున్ గడగట్టి భేరికా**
**దాండ దదాండ దాండ నినదంబులజాండమునిండ మత్తవే**
**దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ !**

భా. రాముడు శత్రువులకు యుద్ధమందు భయంకరుడు. భక్తులకు చుట్టము వంటివాడు. కావున బాణములను, అమ్ములపొదులను, ప్రకాశించుచున్న విలువిద్య నెఱపు తీవ్రమైన భుజముల లాఘవముచే పొగడ్తకన్న శ్రీరామమూర్తికి సాటి దైవము లేడనుచు బ్రహ్మాండ మదురునట్లు ధాంధాం అని భేరీ కొట్టుచు మదపు టేనుగునెక్కి చాటెదను.

**దాసిన చుట్టమా శబరి దాని దయామతి నేలినావు నీ**
**దాసుని దాసుడా గుహుడు తావక దాస్యమొసంగినావు నే**
**జేసిన పాపమో వినుతి సేసిన గావవు గావుమయ్య నీ**
**దాసులలోన నేనొకడ దాశరథీ కరుణాపయోనిధీ!**

భా. రామా! శబరి నీకు దగ్గర చుట్టము కాకపోయినను, దానిని దయతో కాపాడితివి. గుహుడు నీ దాసునికి గూడా దాసుడుకాడు. కాకపోయినను దాసునిగా జేసికొంటివి గాన నేను నీ దాస వర్గములో ఒకడుగా నున్నాడను మరియు నిన్ను స్తోత్రము చేసినను నేను చేసికొన్న పాపమేమో కాని నన్ను గాపాడవు. ఇకనైనా కాపాడుమా!

దైవము తల్లి దండ్రితగు దాత గురుండు సఖుండు నిన్నె కా
భావన సేయు చున్నతఱి బాపములెల్ల మనో వికార దు
ర్భావితు జేయుచున్నవి కృపామతివై నను గావుమీ జగ
త్పావన మూర్తి భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ!

భా. రామా! నేను నిన్ను దైవముగాను, తల్లిదండ్రులుగాను, గురువుగాను, స్నేహితుడుగాను భావించుచుండగా నా పూర్వపాపములన్నియు జేరి నా మనస్సును కలచి దుష్టభావమును కల్పించి చెఱుపుచున్నవి. లోకుల పాపములను బోగొట్ట అవతరించినవాడవు. కనుక నా పాపములను బోనణచి నన్ను కాపాడుము.

# శ్రీ కాళహస్తీశ్వర శతకము

అంతా మిథ్య తలంచి చూచిన నరుండట్లౌ టెరింగిన్ సదా
కాంత ల్పుత్రులు నర్థముల్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతిం చెంది చరించుగాని పరమార్థంబైన నీయందు దా
చింతాకంతయు చింత నిల్పదుకదా శ్రీ కాళహస్తీశ్వరా!

భా. ప్రపంచమంతా మిథ్య అని తెలిసికూడా నరుడు ఎల్లప్పుడును భార్య అనీ, పుత్రులనీ, ధనము, శరీరము నిత్యమని మోహ సముద్రములో పడి భ్రాంతితో తిరుగునేగాని పరమార్థ సత్యమైన నీపై చింతాకంత కూడా ధ్యానము నిల్పదుకదా పరమేశ్వరా!

ఏ వేదంబు పఠించెలూత, భుజగంబే శాస్త్రముల్చూచె దా
నే విద్యాభ్యాసం బొనర్చె గరి, చెంచేమంత్ర మూహించె, బో
ధా విర్భావ నిదానముల్ చదువులయ్యా? కావు మీపాద సం
సేవా సక్తియె కాక జంతు తతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా

భా. పరమేశ్వరా! సాలెపురుగు ఏ వేదము చదివినది? పాము ఏ శాస్త్రములను అభ్యసించినది? ఏనుగు ఏ విద్య నేర్చినది? తిన్నడే మంత్రము జపించినాడు? జ్ఞానోత్పత్తికి చదువులు కారణములు కావు. మహాప్రభో! మీ పాద సేవయే ప్రధాన కారణము. ఆ భక్తితో అవన్నియు మోక్షము నందినవి.

**కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవన భ్రాంతులై!**
**కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్, వారిచే నేగతుల్**
**పడసెన్? పుత్రులులేని యా శుకునకున్ వాటిల్లెనే దుర్గతుల్**
**చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా. కొందరవివేకులు కొడుకులు పుట్టలేదని ఏడ్చెదరు. ధృతరాష్ట్రునకు వంద మంది కొడుకులు పుట్టలేదా? వారివలన అతనికేగతి కలిగినది? పుత్రులు లేని శుకమహర్షికి దుర్గతి అబ్బినదా? పుత్రులు లేనివారికి మోక్షపదవి రాకుండునా?

**గ్రహ దోషంబులు దుర్నిమిత్తములు నీకల్యాణ నామంబు ప్ర**
**త్యహమున్ బేర్కొను నుత్తమోత్తముల బాధంబెట్టగా నోపునే**
**దహనుంగప్ప జాలునే శలభ సంతానంబు? నీసేవచే**
**సి హతక్లేశులు గారుగాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా. మంగళప్రదమైన నామము ప్రతి దినము జపించువానికి గ్రహ దోషములు, చెడు నిమిత్తములైన ఉత్పాతములు బాధించలేవు. మిడుతలెన్నైనా అగ్నిని కప్పగలవా? నీ సేవచేసిన వారికి బాధలన్నియు పోవునుగదా! అట్లు నిన్ను సేవించి బాధలను పోగొట్టుకొనరు గదా అవివేకులు!

**జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యము**
**ల్కల శబ్ద ధ్వనులంచి తాంబర మలంకారంబు దీప్తుల్మెరుం**
**గులు నైవేద్యము మాధురీ మహిమగా గొల్తున్నినున్ భక్తి రం**
**జిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!**

**భా.** పరమేశ్వరా! నేను నిన్ను కవిత్వమున పూజింతును. అందలి రసములు అభిషేక జలములు, మంత్రములు, శబ్దములను పువ్వులు, పొగడ్తలు మంగళ వాద్యములు. ఆకాశ మలంకారము. గుణములే దీపములు. పూజా మాధుర్యవే నైవేద్యముగా దివ్యపూజను నేర్చిన రీతిగా చేయుదునయ్యా!

**పాలుంబువ్వయు బెట్టెదన్ గుడువరా పాపన్న, రాయన్న, లే**
**లెమ్మన్న, నరంటిపండ్లు గొనితే, లేకున్నన్ నొల్లనం**
**టే లాలింపరే తల్లిదండ్రులపుడట్లే తెచ్చి, వాత్సల్య ల**
**క్ష్మీ లీలావచనంబులం గుడుపరా శ్రీకాళహస్తీశ్వరా!**

**భా.** తల్లిదండ్రులు బిడ్డనికి బాబూ! పాలు, బువ్వ పెట్టుదుము. తినరా నాయనా! రారా, లేరా! కాదు, అరటిపళ్ళు తెచ్చి పెట్టినగాని తిననన్నచో అట్లే తెచ్చి తినిపించరా? అట్లే నీవు నన్ను బాలునివలె లాలించి పాలించవలెను.

**పరిశీలించితి మంత్ర తంత్రములు చెప్పన్వింటి సాంఖ్యాది యో**
**గ రహస్యంబులు, వేదశాస్త్రములు వక్కాణించితిని శంక వో**
**దరయం గుమ్మడి కాయలోని యవగింజంతైన, నమ్మించి, సు**
**స్థిర విజ్ఞానము త్రోవ చెప్పగదవే శ్రీకాళహస్తీశ్వరా!**

**భా.** ఈశ్వరా! ఎన్నో మంత్ర తంత్రములు పరిశీలించినాను. సాంఖ్యాది యోగ రహస్యములు మథించినాను. వేదములు, శాస్త్రములు వర్ణించినాను. నా సంశయములు తీరుటలేదు. గుమ్మడికాయలో ఆవగింజంతైనా తెలియలేదు. కాన ఓ దేవా! నాకు స్థిరమైన జ్ఞానము బోధించవయ్యా మహాదేవా!

కాలద్వార కవాట బంధనము దుష్కాల ప్రమాణ క్రియా
లీలాచాలక చిత్రగుప్తముఖ వల్మీకోగ్ర జిహ్వోద్ధృత
వ్యాళ వ్యాళ విరోధి మృత్యుముఖ దంష్ట్రా నాహార్య వజ్రంబుది
క్ష్మేలా లంకృత నీదునామ మరయన్ శ్రీకాళహస్తీశ్వరా!

భా. ఓ దిగంబరా! నీనామము నరకమునకు తలుపులు వేయు గడియ వంటిది. చిత్రగుప్తుని నాలుకయనెడి పామునకు గరుత్మంతుని వంటిది. మృత్యువునకు వజ్రము వంటిది.

నీరూపంబు దలంపగా తుదిమొదల్లేగాన నీవైనచో
రారా రమ్మనియంచు చెప్పవు, వృథారంభంబు లింకేటికిన్
నీరన్ముంపుము పాలముంపుమిక నిన్నే నమ్మినాదం జుమీ
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా!

భా. శ్రీరామునిచే పూజింపబడిన పాదయుగళము కలవాడా! నీ రూపము తుదమొదలు నేను కనిపెట్టలేను. నీవా నన్ను రారా అని చేరపిల్వవు. వృథా ప్రయత్నములేల? నిన్నే నమ్మియున్నాను. పాలముంచినను, నీట ముంచినను భారము నీదే ఈశ్వరా!

# భాస్కర శతకము

ఈ జగమందు దా మనుజుడెంత మహాత్మకుడైన దైవమా
తేజము తప్పు జూచునెడ ద్రిమ్మరి కోల్పడు నెట్లన న్మహా
రాజకుమారుడైన రఘురాముడు గొల్పడగాయ, లాకులున్
భోజనమై తగన్వనికి బోయి చరింపడె మున్ను భాస్కరా!

భా. పూర్వము దశరథ మహారాజు కుమారుడైన రాముడు కాలి నడకతో నడవికేగి ఆకుల, కాయలు ఆహారముగ చేసుకొని తిరుగవలసి వచ్చెను. అటులనే మనుజుడు తానెంత గొప్పవాడైనను దైవానుగ్రహము లేని యెడల ఆ గొప్ప బోగొట్టుకొని దేశ సంచారియై తిరుగును.

చేసిన దుష్టచేష్ట నది చెప్పక నేర్పున గప్పిపుచ్చి తా
మూసిన యంతటన్ బయలు ముట్టక యుండ దదెట్లు రాగిపై
బూసిన బంగరుం జెదరి పోనగడంగిననాడు నాటికిన్
దాసిన రాగి గానబడదా జనులెల్లరెఱుంగ భాస్కరా!

భా. రాగిపై పొదిగిన బంగారపు పూత చెదరిపోయిన క్రమక్రమముగా నందున్న రాగి అందరకూ కనపడును. అటులనే నీచుడొక నీచకార్యము చేసి చెప్పకుండ ఉపాయముచే దాచిపెట్టినను అది క్రమముగ అందరకూ తెలియకమానదు.

ఎడ్డె మనుష్యుడే మెఱుగు నెన్ని దినంబులు గూడియుండినన్
దొడ్డ గుణాఢ్యునందు గల తోరపు వర్తనురెల్ల బ్రజ్ఞ బే
ర్పడ్డ వివేకిరీతి; రుచిపాకము నాలుకగా కెఱుంగునే?
తెడ్డది కూరలో గలయ ద్రిమ్మరుచుండిననైన భాస్కరా!

భా. కూర యొక్క రుచిని నాలుక తెలుసుకొనునుగాని ఎల్లప్పుడు కూరలలో దిరుగుచున్నను, తెడ్డారుచిని తెలిసికొనలేదు. అటులనే గుణవంతుని యందలి మంచి నడకలు తెలివిచే ప్రసిద్ధికెక్కిన జ్ఞాని తెలిసికొనునుగాని ఆ గుణవంతునితో యెన్ని దినములు కలిసి తిరిగినను మూర్ఖుడు తెలిసికొనలేడు.

పండితులైనవారు దిగువందగ నుండగ నల్పుడొక్కడు
ద్దండత బీఠమెక్కిన బుధప్రకరంబున కేమి యెగ్గగున్
గొండొక కోతి చెట్టు కొన కొమ్మల నుండగ గ్రింద గండ భే
రుండ మదేభసింహ నికురుంబములుండవె చేరి భాస్కరా!

భా. చెట్టు క్రింద గండ భేరుండాది సముదాయముండగా నా చెట్టు కొమ్మల చివరయందొక కోతియున్ననూ ఆ మృగములకేమియు లోపము లేదు. అటులనే పండితులు క్రింద కూర్చున్నపుడొక నీచుడు దుష్టత్వముచే పీఠము మీద కూర్చున్నప్పటికి ఆ పండితుల కంత మాత్రము చేత ఏమియూ కొరత గలుగదు.

**ఉరుకరుణాయుతుండు సమయోచిత మాత్మదలంచి యుగ్రవా**
**క్పరుషత జూపినన్ ఫలముగల్గుట తథ్యముగాదె యంబుదం**
**బురిమిన యంతనే కురియ కుండునె వర్షము లోక రక్షణ**
**స్థిరతర పౌరుషంబున నశేష జనంబు లెఱుంగ భాస్కరా!**

**భా.** మేఘుడు ప్రాణంబునకు భయంబు గలుగునట్లురిమి వెంటనే జనులను రక్షించు పట్టుదలతో అందరికీ ఆనందము గలుగునట్లు వర్షించును. అటులనే గొప్ప దయ గలిగినవాడు సమయానుకూలముగా కఠిన వాక్యము లాడినను తరువాత తప్పక మేలు చేయును.

**చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా**
**చదువు నిరర్థకంబు, గుణసంయుతులెవ్వరు మెచ్చరెచ్చటం**
**పదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు ఇం**
**పొదవెడు ఉప్పులేక రుచి పుట్టగ నేర్చునటయ్య భాస్కరా!**

**భా.** మనుష్యుడెంత చదివినా, కొంచెమైనా రసజ్ఞత లేకపోతే ఆ చదువు వ్యర్థము. చదువులోగల సారాన్ని తెలుసుకోవాలి. రసికత్వం ఉండాలి. అప్పుడే ఆ చదువును అందరూ మెచ్చుకుంటారు. మంచి కూర నలపాకంలా చేసినా అందులో ఉప్పు వెయ్యకపోతే ఆ కూరకు రుచిరాదు. ఎవ్వరూ ఆస్వాదించరు. ఉప్పులేని కూర ఎంత బాగా వండినా బాగుండదు. అట్లాగే రసజ్ఞత లేని చదువు కూడా వ్యర్థమైనదే!

**కారణమైన కర్మములు కాక దిగంబడవెన్ని గొందులం**
**దూఱిన నెంతవారలకు, దొల్లి పరీక్షితు శాపభీతుడై**
**వారధి నొప్పు నుప్పరిగపై బదిలంబుగ దాగియుండి నం**
**గ్రూర భుజంగ దంతహతి గూలడె లోకులెఱుంగ భాస్కరా!**

**భా.** పరీక్షిన్మహారాజు ముని ఇచ్చిన శాపమునకు భయపడి సముద్రము లోని మేడపై భద్రముగా దాగియున్ననూ, పాముకాటు వలన చనిపోయెను. అట్లే ఎంత గొప్పవారలైననూ ఎన్ని మూలలలో దాగియున్ననూ అనుభవింపవలసిన కర్మ అనుభవింపక తప్పదు.

ఊరక సజ్జనుం డొదిగి యుండిన నైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా
చీరలు నూఱుటంకములు చేసెడివైనను బెట్టెనుండగా
జేరి చినింగి పోగొఱుకు చిమ్మటకేమి ఫలంబు భాస్కరా!

భా. చీరెలు, బట్టలు వేల రూపాయల విలువ చేసేవి పెట్టెలో వున్నప్పటికీ చిమ్మెట పురుగు తనకేమి లాభం లేకపోయినా చీరలను, బట్టలను కొరికి ముక్కలు ముక్కలుగా చేస్తుంది. అట్లాగే మంచి మనిషి ఎంత ఒదిగిఉన్నా - చెడ్డవాడు కారణం లేకుండానే సహించలేక మంచివానికి అపకారం చేస్తూ ఉంటాడు.

తగిలి మదంబుచే నెదిరి దన్ను నెఱుంగక దొడ్డవారిలో
బగ గొని పోరుటెల్ల నతి పామరుడై చెడుటిరతెకాక తా
నెగడి జయింపనేరదది నిక్కము దప్పదు ధాత్రిలోపలన్
దెగి యొక కొండతో దగరు ఢీకొని దాకిననేమి? భాస్కరా!

భా. గొఱ్ఱెపోతు సాహసించి యొక పర్వతమును యెదుర్కొని తాకినచో దాని తల పగులుట తప్ప లాభమేమియు నుండదు. అటులనే బలహీనుడు కావరముచేత, దనయొక్కయు, ఎదుటివారి యొక్కయు బలము దెలియకుండ గొప్పవారితో విరోధము పూని పోట్లాడినచో దానే చెడిపోవునుకాని లాభమేమియు పొందదు.

క్రూర మనస్కులౌ పతుల గొల్చి వసించిన మంచి వారికిన్
వారి గుణం పట్టి చెడు వర్తన వాటిలు, మాధురీ జలో
ధారలు గౌతమీ ముఖ మహానదులంబుధి కూడినంతనే
క్షారము చెందవే మొదలి కట్టడలన్నియు దప్పి భాస్కరా!

భా. మంచివారు క్రూర బుద్ధులగు రాజులను సేవిస్తే, మంచివారికి గూడా వారి మంచి గుణాలు పోయి క్రూర గుణాలే వస్తాయి. అదెలాగంటే తియ్యని నీరుగల గోదావరి మొదలగు నదులు సముద్రాన్ని చేరిన తర్వాత వెనువెంటనే తియ్యదనం పోయి ఉప్పగా మారే విధంగా.

**తనకు ఫలంబు లేదని యెదం దలపోయడు కీర్తిగోరు నా**
**ఘన గుణశాలి లోకహిత కార్యము మిక్కిలి భారమైన మే**
**లనుకొని పూను శేషుడు సహస్ర ముఖంబుల గాలిని గ్రోలి తా**
**ననిశము మోవదేమతి మహాభరమైన ధరిత్రి భాస్కరా!**

భా. ఆదిశేషుడు తనవేయి నోళ్ళతో గాలినే పీల్చుకొనుచు తనకేమియు లాభము లేకున్నను, మిక్కిలి బరువు గల భూమిని ఎల్లకాలమును మోయుచున్నాడు. అటులనే కీర్తి గోరువాడు తనకు లాభము కలుగలేదని మదిని దలపోయక, లోకమునకు మేలగుపని ఎంత కష్టమైనదైననూ మంచిదే యనుకొని పూనిచేయును.

**బలయుతుడైనవేళ నిజబంధుడు తోడ్పడుగాని యాతడే**
**బలము తొలంగెనేని తనపాలిట శత్రు, రదెట్లు బారుణడై**
**జ్వలనుడు కానగాల్చు తరిసఖ్యము జూపును వాయుదేవుడా**
**బలియుడు సూక్ష్మదీపమగు పట్టున నార్పడె గాలి భాస్కరా**

భా. మానవుడు బలవంతుడుగా ఉన్నపుడే బంధువులుగానీ మిత్రులుగానీ అతనికి తోడ్పడుతారు. బలం లేనప్పుడు తన బంధువే, స్నేహితుడే శత్రువై కీడు చేస్తాడు. అదేవిధంగానంటే బలంగా మండుతున్నపుడు వాయువుతోడై ఇంకా బాగా మండేట్లు చేస్తాడు. అగ్ని చిరుదీపమై వెలిగేటప్పుడు గాలి విరోధియై దానిని ఆర్పేస్తాడు.

**పూరిత సద్గుణంబులుగల పుణ్యున కించుక రూప సంపదల్**
**దూరములైన వానియెడ దొడ్డగ జూతురు బుద్ధిమంతు లె**
**ట్లారయ గొగ్గులైన మతియందుల మాధురి చూచి కాదె ఖ**
**ర్జూర ఫలంబులం బ్రియము చొప్పడ లోకులు గొంట భాస్కరా!**

భా. ఖర్జూరపు పండ్లు పైకి గొగ్గిగొగ్గిగా నున్ననూ, వానియందు గల మాధుర్యములు జూచి ప్రజలు ప్రియముతో గొనుచుందురు. అటులనే సద్గుణములు గలవానికి సౌందర్యము లేకుండినను బుద్ధిమంతులు వానిని గౌరవించెదరు.

# భర్తృహరి సుభాషితములు

తమ కార్యంబు బరిత్యజించియు బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్
దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుక జనుల్ దైత్యుల్ వృధాన్యార్థ భం
గము గావించెదువార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్

భా. తమ కార్యముల విడచి పరుల కార్యములను చేయువారు సత్పురుషులు. తమ కార్యములకు భంగము లేకుండ పరుల కార్యముల నొనర్చువారు మధ్యములు. తమ కార్యము నిమిత్తమై పరుల కార్యమును చెడగొట్టువారు మనుషులలో రాక్షసులు. తమకు ప్రయోజనము ఏమాత్రము లేకపోయినను పరులకు నష్టము చేయువారలకేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుటలేదు. ఈ యుత్తమాది పక్షములలో ఏది మేలయినచో దానిని ఆయుష్మంతుడగు వాడు ఆశ్రయింపవలెను.

అఘము వలన మరల్చు హితార్థ కలితు
జేయు, గోప్యంబుదాచు బోషించు గుణము
విడువడాపన్ను, లేవడి వేళనిచ్చు
మిత్రుడీ లక్షణంబుల మెలంగు చుండు

భా. చెడుపనుల నుండి వారించుట, మంచి పనులను చేయుటకు ప్రోత్సహించుట, రహస్యములను దాచుట, సద్గుణముల ప్రకటించుట, ఆపత్కాలమున విడువకుండుట, సమయమునకు కావలసినదాని నిచ్చుట ఇవి మంచి మిత్రున కుండవలసిన లక్షణములు.

**తనిసిరే వేల్పు లుదధి రత్నముల చేత**
**వెఱచిరే ఘోర కాకోల విషము చేత**
**విడిచిరే యత్నమమృతంబు వొడము దనుక**
**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు**

**భా.** అమృతమునకై పాలసంద్రమును మధింపుచున్న దేవతలు అందలి రత్న లాభములకు సంతోషింపక, అందు పుట్టిన కాలకూట విషమునకు భయపడక, అమృతము కలుగునంత దనుక తమ పట్టును వదలలేదు. ధీరులెప్పుడు తాము తలంచిన కార్యమగునంత వరకు తమ ప్రయత్నములను వదలరు.

**ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై**
**యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్**
**ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్**

**భా.** అధములు విఘ్నములు సంభవించునని కార్యము నారంభింప భయపడుదురు. మధ్యములు ఆరంభించి విఘ్నములు వచ్చినపుడు దానిని విడిచిపెట్టెదరు. కాని ధీరులెన్ని పర్యాయములెన్ని విఘ్నములు వచ్చినను తాముపట్టిన కార్యమును విడువరు.

**కారణములేని కలహంబు గరుణ లేమి**
**పరవధూపర ధనవాంఛ బంధు సాధు**
**జనములం దనహిష్ణుత్వ మనగ జగతి**
**బ్రకృతి సిద్ధంబులివి దుష్ట నికరమునకు**

**భా.** దయాహీనత, నిష్కారణమైన కలహము, పరుల ధనమునందును, పరస్త్రీల యందును ఆసక్తి, సజ్జనుల యందును, బంధువులయందును ఓర్పులేమియు - ఇవి దుర్జనుల స్వభావ సిద్ధ గుణములు.

**తరువు లతిరస ఫలభార గురుత గాంచు**
**నింగి[వేలుచు నమృత మొసంగు మేఘు**
**డుద్ధతులు గారు బుధులు సమృద్ధి చేత**
**జగతి నుపకర్తలకు నిది సహజ గుణము**

భా. వృక్షములు ఫలకాలమున వంగియుండును. నూతనాంబువులు గలమేఘములు బరువుచే క్రిందుగనే [వేలాడుచుండును. సత్పురుషులు సంపదలు వచ్చినపుడు గర్వము వహింపరు. ఇది పరోపకార పరాయణుల స్వభావము. ఈ నమ్రత క్రిందుగ నుండుట, గర్వము లేకుండుట అనునవి పరోపకార పరులకు సహజగుణములు.

**అమరు జెవి శాస్త్రమున గుండలమునగాదు**
**వలయు నొప్ప దీవిచే వెలయుబాణి**
**యురు దయాఢ్యులమేను పరోపకార**
**కలన రాణించు గంధంబు వలన గాదు**

భా. దయావంతులగు సత్పురుషుల చెవులకు శాస్త్ర[శవణ మలంకారముగాని కుండలములుగావు. వారి హస్తములకు అలంకారము సత్పాత్రదానము గాని కంకణములు కావు. వారి దేహమున కలంకారము పరోపకారము గాని గంధము పూసికొనుట గాదు.

**ద్యుమణి పద్మాకరము వికచముగ జేయు**
**గుముద హర్షంబు గావించు నమృత సూతి**
**యర్థితుడుగాక జలమిచ్చు నంబుధరుడు**
**సజ్జనులు దారె పరహితా చరణమతులు**

భా. సూర్యుడు [ప్రార్థింపబడకయే తామరకొలనును వికసింపజేయును. చంద్రుడు [ప్రార్థింపబడకయే కలువల వికసింపజేయుచున్నాడు. మేఘుడు యాచింపబడకయే నీటిని ఇచ్చుచున్నాడు. సత్పురుషులెప్పుడూ పరులకు హితమొనర్చుటయందే ఇష్టపడతారు.

**ఆకాశంబున నుండి శంభుని శిరం బందుండి శీతాద్రి సు**
**శ్లోకంబైన హిమాద్రి నుండి భువి భూలోకంబునందుండి య**
**స్తోకాంబోధి బయోధి నుండి పవనాంధో లోకముంజేరె గం**
**గా కూలంకష పెక్కు భంగులు వివేక భ్రష్ట సంపాతముల్**

**భా.** గంగానది మొదట ఆకాశము నుండి ఈశ్వరుని తలమీదను, అచ్చటి నుండి హిమవత్పర్వతము మీదను, ఆ పర్వతము నుండి భూమి మీదను, భూమి నుండి సముద్రమునకును అచ్చటి నుండి పాతాళ లోకమును చేరెను. గొప్ప స్థితి నుండి తొలగినవారికే విధముగా పలు కష్టములు సంభవించునో ఈ పద్యమున దెలుపబడినది.

మూర్ఖుని మూర్ఖత్వమును దొలగించుటకు ఏ శాస్త్రము లేదు. ఉపాయము లేదు అని చెప్పే సందర్భంలోనిదీ పద్యం.

**హర్తకు గాదు గోచర మహర్నిశమున్ సుఖ పుష్టి సేయు స**
**త్కీర్తి ఘటించు విద్యయను ధనం బఖిలార్థకోటికిం**
**బూర్తిగ నిచ్చినన్ బెరుగు బోదు యుగాంతపు వేళనైన భూ**
**భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పగున్**

**భా.** విద్యా ధనమును దొంగలు హరింపలేరు. అది ఎల్లప్పుడు సుఖమునే కలుగజేయును. కోరినవారి కెల్లప్పు డిచ్చుచుండినను అది తరగిపోదు. మరింత వృద్ధి నందుతుంది. ప్రళయకాలమప్పుడును నశింపదు. ఇట్టి విద్యాధనము గలవారి యెడ సామాన్య ధనముగల రాజులు దురాగ్రము చూపరాదు. వారినెదుర్కొనుట కెవ్వరును చాలరు.

**తెలియని మనుజుని సుఖముగ**
**దెలుపందగు సుఖ తరముగ దెలుపగ వచ్చున్**
**దెలిసిన వానిం దెలిసియు**
**దెలియని నరుదెల్ప బ్రహ్మదేవుని వశమే**

భా. తెలియని వానికి సులభముగా తెలుపవచ్చును. చక్కగా తెలిసినవానికి సమాధానము చెప్పుట మరింత సులభము. స్వల్ప జ్ఞానము కలిగి సర్వజ్ఞుడనని గర్వపడు వానిని సృష్టికర్తయగు బ్రహ్మయు రంజింపనేరదు. మూర్ఖుని మెప్పించుట అశక్యము అను సందర్భములో ఈ పద్యము చెప్పబడింది.

**తివిరి యిసుమున తైలంబు దీయవచ్చు**
**దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు**
**దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు**
**జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు**

భా. ప్రయత్నము చేసి ఇసుక నుండి కూడ చమురు తీయవచ్చును. ఎండ మావులలో సైతము నీరును సంపాదించి త్రాగవచ్చును. తిరిగి కుందేటి కొమ్మునైనను సాధించవచ్చును. కాని దురాగ్రహము గల మూఢుని మనస్సును మాత్రం సమాధాన పెట్టుటకు సాధ్యముకాదు.

**గురుడు గురుండు, వాలు శతకోటి సుపర్వులు వాహినీ పతుల్**
**సురభవనంబుగోట, మధుసూదనుడుం సయిదోడు, దంతి ది**
**క్కరిపతి గాగ నొప్పు బలఘాతియు దాయలకోడె నాజిలో**
**శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్ని భంగులన్**

భా. దేవేంద్రునకు గురువు బృహస్పతి. ఆయనకు ఆయుధం వజ్రాయుధం. దేవతలు ఆయన సేనలో ఉన్నారు. స్వర్గము ఆయనకు కోట. విష్ణుమూర్తి అనుగ్రహం ఆయనకుంది. ఐరావతం ఆయన దగ్గర ఉంది. ఈ విధమైన ఆశ్చర్యాన్ని కల్గించే శక్తిగల ఇంద్రుడు కూడా శత్రువుల చేత యుద్ధంలో ఓడిపోయాడు. కావున దైవబలమే ప్రధానముగాని పౌరుషమెంత మాత్రము పనికిరాదు.

ధర ఖర్వాటు డొకండు సూర్యకర సంతప్త ప్రథానాంగుడై
త్వరతోడన్ బరువెత్తి నిలచెన్ దాళద్రుమచ్ఛాయ ద
చ్ఛిరముం దత్ఫల పాత వేగమున విచ్చెన్ శబ్దయోగంబుగా
బొరి దైవోపహతుండు పోవుకడకుం బోవుంగదా యాపదల్

భా. బట్టతల వాడొకడు మధ్యాహ్న కాల సూర్యుని వేడిమి చేత తన తల మాడుచుండుటకు తాళజాలక నీడగల ప్రదేశమును కోరి తాటి చెట్టు క్రిందికి బోయెను. దైవికముగ అప్పుడా చెట్టు నుండి యొక పండు వాని తలమీద బడి వానితల పటపటమని బ్రద్దలయ్యెను. దైవబలము చాలని వాడెచటికి బోయినను అచటికే ఆపదలన్నియు పోవును.

తనువులు ముడుంగు, బాదగతి తప్పును, దంతములూడు, జేకటుల్
కనుగవ వర్తిలుం, జెవుడు గ్రమ్మును, జొంగలుగాఱు మోమునన్
జనములు మాట చేకొనరు, సన్నిధి జేరదు భార్య, పుత్రుడుం
గొనకొని శత్రునట్లు తిరుగుం గడుగష్టము వృద్ధి దేహికిన్

భా. ముదుసలియగువాని గతి ఎట్లుండుననగా – ఒడలు ముడుతలు పడును. అడుగులు తడబడును. దంతములు రాలిపోవును. చూపు దప్పును చెవుడు హెచ్చుగును. నోర చొంగలుకారును. చుట్టాలు మాటవినరు. పెండ్లము సయితము ఉపచారము చేయదు. పుత్రుడు సైతము శత్రువగును. ఎంత కష్టము! ఇట్టి శరీరమునెడ నా వెట్టియభిమానము? కనుక నీపాడు దేహము నభిమానింపక మోక్షోపాయమును చూచుకొన వలెనని భావము.

భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలు గావు పురుషుని భూషితు జేయు బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్

**భా.** పురుషునకు భుజకీర్తులు, సూర్యహారములు, చంద్రహారములు మొదలగు సొమ్ములుగాని, స్నానము, గంధము పూసికొనుట, పూలు ముడుచు కొనుట, కురులు దువ్వుకొనుట మొదలగు వానిలో నేదియుగాని అలంకారము నియ్యజాలదు. శాస్త్ర సంస్కారముగ వాక్కు ఒకటియే అలంకారమును కలుగజేయును. సువర్ణమయాది భూషణములన్నియు నశించును. వాగ్భూషణ మొక్కటియే నశింపని భూషణము.

**సత్య సూక్తి ఘటించు ధీ జడిమ మాన్చు**
**గౌరవ మొసంగు జనులకు గలుష మడుచు**
**గీర్తి బ్రకటించు చిత్త విస్ఫూర్తిజేయు**
**సాధు సంగంబు సకలార్థ సాధనంబు**

**భా.** సత్సహవాసము బుద్ధి మాంద్యమును బోగొట్టును. సత్యవాక్యములనే పలుకజేయును. మంచిగౌరవము నిచ్చును. పాపములను బోగొట్టును. మనస్సును బాగుచేయును. దిక్కుయందు కీర్తిని వ్యాపింపచేయును. అది చేయజాలని మంచి ఏ లోకముననూ లేదు.

**విద్యనిగూఢ గుప్తమగు విత్తము రూపము పురుషాళికిన్**
**విద్య యశస్సు భోగకరి, విద్య గురుండు విదేశ బంధుడున్**
**విద్య విశిష్ట దైవతము, విద్యకుసాటి ధనంబులేదిలన్**
**విద్య నృపాల పూజితము, విద్యనెఱుంగనివాడు మర్త్యుడే!**

**భా.** పురుషునకు విద్యయే రూపము. విద్యయే రహస్యముగ దాచిపెట్టబడిన ధనము. విద్యయే సకల భోగములను, కీర్తిని, సుఖమును కలుగ జేయును. విద్యయే గురువువలె అన్నియు బోధించును. పరదేశమునందు చుట్టమువలె సహాయ మొనర్చును. విద్యయే పరమాత్మ. విద్యయే పూజితము. ధనమిట్టిదికాదు. ఇట్టి విద్యలేనివాడు పశువుతో సమానము.

# నరసింహ శతకము

చిత్త శుద్ధిగ నీకు సేవజేసెదగాని
  పుడమిలో జనుల మెప్పులకు గాదు
జన్మ పావనతకై స్మరణ జేసెదగాని
  సరివారిలో బ్రతిష్టలకు గాదు
ముక్తి కోసము నేను మ్రొక్కివేడెద గాని
  దండి భాగ్యము నిమిత్తంబు గాదు
నిన్ను బొగడ విద్య నేర్చితినేకాని
  కుక్షి నిండెడు కూటి కొరకుగాదు

పారమార్థికమునకు నే బాటు పడితి
గీర్తికి నపేక్ష పడలేదు కృష్ణ వర్ణ !
భూషణ వికాస! శ్రీ ధర్మపుర నివాస!
దుష్ట సంహార! నరసింహ! దురిత దూర!

భా. ఓ నరసింహస్వామీ! మనసార నీకు పూజ చేయుదును. జనుల మెప్పునకు గాదు. పుట్టుక యొక్క మంచికై నిన్ను పలుమార్లు తలచు కొందును. సమానులయందు మర్యాద బొందుటకు మాత్రము గాదు. మోక్షమునకై నిన్ను మ్రొక్కి ప్రార్థించెదను. బాగా భాగ్యముల కొరకు గాదు. నిన్ను పొగడుటకై విద్య నేర్చితిని. కడుపు నింపుకోవటానికి పనికివచ్చే అన్నమునకు కాదు. నల్లని దేహఛాయ గలవాడా! కీర్తిని ఆశింపలేదు. నేను మోక్షము కొరకే పాటుపడితిని.

గార్ధభంబున కేల కస్తూరి తిలకంబు?
  మర్కటంబునకేల మలయజంబు
శార్దూలమునకేల శర్కరా పూపంబు
  సూకరంబునకేల చూతఫలము

మార్జాలమునకేల మల్లెపువ్వుల బంతి
గుడ్లగూబలకేల కుండలములు
మహిషంబుకేల నిర్మలమైన వస్త్రముల్
బక సంతతికేల పంజరంబు

ద్రోహ చింతన జేసెడి దుర్జనులకు
మధురమైనట్టి నీ నామ మంత్రమేల?
భూషణ వికాస! శ్రీధర్మ పురనివాస
దుష్టసంహార! నరసింహా! దురిత దూర!

భా. నరసింహా! గాడిదకు కస్తూరిబొట్టు, కోతికి గంధము, బెబ్బులికి చక్కెర పిండివంట, పందికి మామిడిపండు, పిల్లికి మల్లెపూల చెండు, గుడ్లగూబలకు చెవుల పోగులు, దున్నపోతునకు పరిశుభ్రమైన వస్త్రము, కొంగలకు పంజరము ఎట్లక్కరలేదో అటులనే చెడ్డ ఆలోచన చేసే దుర్మార్గులకు నీ మధురమైన నామమంత్రమక్కరలేదు.

పసరంబు పండైన బసుల కాపరి తప్పు
ప్రజలు దుర్జనులైన ప్రభుని తప్పు
భార్య గయ్యాళైన ప్రాణనాధుని తప్పు
తనయుడు దుడుకైన దండ్రి దప్పు
సైన్యంబు చెదరిన సైన్యనాధుని తప్పు
కూతురు చెడుగైన మాత తప్పు
అశ్వంబు దురుసైన నారోహకుని తప్పు
దంతి మదించ మావంతు తప్పు

ఇట్టి తప్పులెరుంగక యిచ్చవచ్చి
నటుల మెలగుదు రిప్పుడీ యవని జనులు
భూషణ వికాస! శ్రీ ధర్మ పుర నివాస!
దుష్టసంహార! నరసింహా! దురితదూర!

భా. నరసింహా! పసరము చెడ్డదైన తప్పు పశులకాపరిది. ప్రజలు చెడ్డవారైన రాజుది తప్పు. భార్య ఎదురాడునదైన మగని తప్పు. కొడుకు దుర్మార్గుడైన తండ్రిది తప్పు. సైన్యము చిందఱవందఱైన సైన్యాధిపతిది తప్పు. బిడ్డ చెడ్డదైన తల్లిది తప్పు. భూమియందుండు మనుష్యులిట్టి తప్పులు తెలిసికొనకుండ నేడు తమ ఇష్టము వచ్చినట్లు సంచరింతురు.

**తల్లిగర్భము నుండి ధనము దేడెవ్వడు**
**వెళ్ళిపోయెడినాడు వెంటరాదు**
**లక్షాధికారైన లవణ మన్నమె కాని**
**మెఱుగు బంగారంబు మ్రింగబోడు**
**విత్త మార్జన చేసి విఱ్ఱవీగుటె గాని**
**కూడబెట్టిన సొమ్ము గుడువబోడు**
**పొందుగా మఱుగైన భూమిలోపల బెట్టి**
**దాన ధర్మము లేక దాచిదాచి**

**తుదకు దొంగల కిత్తురో? దొరలకవునొ?**
**తేనె జుంటీగలియ్యవా తెరువరులకు**
**భూషణ వికాస! శ్రీధర్మపుర నివాస!**
**దుష్టసంహార! నరసింహ! దురితదూర!**

భా. న: ుఛహా! తల్లి కడుపు నుండి ధనమెవ్వడును తీసుకొని రాడు. లక్షాధికారియైనా ఉప్పు మెతుకులేగాని మెరుగు బంగారమును మ్రింగలేడు. డబ్బు సంపాదించి విఱ్ఱవీగుతారుగాని కూడబెట్టిన సొమ్మును అనుభవించ లేరు. భూమిలో ధనముబెట్టి దాన ధర్మములు చేయక దాచిన వారిసొమ్ము తుదకు దొంగలకో, రాజులకో (పోతుంది) ఇస్తారు. తేనెటీగలు కష్టపడి దాచుకొన్న తేనెను బాటసారులకిచ్చినట్లు అవుతుంది. (అంటే ధనాన్ని దానధర్మాలు చెయ్యాలిగాని దాచరాదని భావము).

అధిక విద్యావంతులప్రయోజకులైరి
  పూర్ణ శుంఠలు సభాపూజ్యులైరి
సత్యవంతులమాట జనవిరోధంబాయె
  దరువ బోతులమాట వాసికెక్కె
ధరవాసన పరుల్ దారిద్ర్యమొందిరి
  పరమలోభులు ధనప్రాప్తులైరి
పుణ్యవంతులు రోగ భూతపీడితులైరి
  దుష్టమానవులు వర్ధిష్టులైరి

పక్షివాహన! మావంటి భిక్షుకులకు
శక్తిలేదాయె, నిక నీవె చాటు మాకు
భూషణ వికాస! శ్రీధర్మపుర నివాస!
దుష్ట సంహార! నరసింహ! దురితదూర!

భా. నరసింహా! బాగుగా చదువుకున్నవారు పలికిమాలినవారయ్యారు. పూర్తిగ తెలివిలేనివారు సభలలో పూజింపబడేవారయ్యారు. నిజం చెప్పేవారి మాట జనానికి విరోధమయ్యింది. ఊరక మాటలాడే వారిమాట ప్రాధాన్యత పొందింది. ధర్మవాదనలు చేసేవారు దరిద్రులయ్యారు. మిక్కిలి పిసినారులు ధనవంతులయ్యారు. పుణ్యాలు చేసినవారు వ్యాధుల చేత, భూతముల చేత పీడింపబడ్డారు. దుర్మార్గులు వృద్ధినొందారు. గరుత్మంతుని వాహనముగా గలవాడా! మావంటి బిచ్చగాండ్రకు శక్తి (బలము) లేదు. నీవే మాకు దిక్కు.

ధరణిలో వెయ్యేండ్లు తనువు నిల్వగ బోదు
  ధనమెప్పటికి శాశ్వతముగాదు
దార సుతాదులు తనవెంట రాలేరు
  భృత్యులు మృతిని దప్పింపలేరు

భా. నరసింహా! ఎక్కువగా చదువుట కూడుగుడ్డల కొరకే. పశువులను సంపాదించుట పాల కొఱకె. ఆడదానిని పెండ్లాడుట సంసార సుఖమునకే. కొడుకుల బెంచుట పుణ్యలోక గతుల కొరకే. సైన్యమును కూర్చుకొనుట శత్రు భయంబుకే. సామునేర్చుట చావు కొఱకే. దానమిచ్చుట ముందు వచ్చే పుణ్యాన్ని మూట గట్టుకుంటానికే. ఎక్కువగా చదువుట కడుపుకొరకే. ఇతరములైన కోరికలు కోరక యెల్లప్పుడూ నీపై భక్తి నిలుపుట మోక్షము కొఱకే.

# కుమార శతకము

వృద్ధ జన సేవ చేసిన
బుద్ధి విశేషజ్ఞుడనుచు బూత చరితుడున్
సద్ధర్మశాలియని బుధు
లిద్ధర బొగడెదరు ప్రేమ యెసగన్ గుమారా!

భా. పెద్దలను భక్తితో గొలుచుచున్న యెడల వానిని లోకము నందు పరిశుద్ధమగు మనస్సు గలవాడనియు తెలివితేటలు బాగుగ నుండు వాడనియు, ధర్మముల నెఱింగిన వాడనియు పెద్దలు పొగడెదరు.

ధరణీనాయకు రాణియు
గురు రాణియు నన్నరాణి కులకాంతను గ
న్న రమణి దను గన్నదియును
ధరనేవురు తల్లులనుచు దలపు గుమారా!

భా. రాజు భార్యయును, గురు భార్యయును, అన్నభార్యయును, అత్తయును, కన్నతల్లియును ఈ ఐదుగురు తల్లులని భావింపవలెను.

సదమల మతితో బెద్దల
మదికింపుగ మెలగు నింద మానుము పరులన్
మృదు మార్గములను వదలకు
విదితంబుగ దానగీర్తి వెలయు గుమారా!

భా. మంచి బుద్ధి గలిగి పెద్దలు మెచ్చుకొనునట్లు నడువుము. ఇతరుల నెప్పుడును నిందించవద్దు. మంచి మార్గములను విడువవద్దు. ఈ రీతిగా ప్రవర్తించిన ఎడల నీకు నిర్మలమైన కీర్తి రాగలదు.

**ఆచార్యున కెదిరింపకు**
**బ్రోచిన దొర నింద సేయ బోకుము కార్యా**
**లోచనము లొంటి జేయకు**
**మాచారము విడువబోకుమయ్య కుమారా!**

భా. ఉపాధ్యాయుని ఎదిరింపరాదు. నిన్ను కాపాడిన వారిని తిట్టవద్దు. ఏదైనా ఆలోచన చేయుటలో ఒంటరిగా చేయవద్దు. మంచి నడవడిని వదలి పెట్టవద్దు.

**తనకును విద్యాభ్యాసం**
**బును జేసిన వానికన్న బొలుపుగ బదిరె**
**ట్లను దూగు దండ్రి వానికి**
**జననియు బదిరెట్లు తూగు జగతి కుమారా!**

భా. విద్యనేర్పిన గురువుకంటె దండ్రి పదిరెట్లు ఎక్కువవాడు. తల్లి నూఱింతలు ఎక్కువ. కాబట్టి తల్లిదండ్రులు గౌరవింపదగినవారు.

**తనదు కులాంగన యాలో**
**చనమున మంత్రియును భుక్తి సమయంబున దా**
**జననియు రతిలో రంభా**
**వనజేక్షణ మయిన బుణ్యవశము కుమారా!**

భా. ఆలోచనము చేయునపుడు భార్య భర్తకు మంత్రివలె, భోజన కాలమున తల్లివలె, సుఖమును గూర్చుటలో రంభ వంటిదిగాయున్న యెడల వాని బుణ్యమే పుణ్యము.

**తిరుగకు దుర్మార్గులతో**
**నరుగకు గహనాంతర స్థలాదుల కొంటిన్**
**జరుగకు శత్రుల ప్రోల**
**నర్మువకు మేన్ హితుల యెడల మదిని గుమారా!**

భా. చెడ్డవారిలో తిరుగకు. ఒంటరిగా అడవులకు వెళ్ళవద్దు. శత్రువుల దగ్గర చేరవద్దు. మనసులో మిత్రుల ఉపకారములను మరచిపోవద్దు.

**కాయమున నాటు శరములు**
**పాయంబున దీయవచ్చు బహు నిష్ఠురతన్**
**గూయ మది నాటు మాటలు**
**పాయవుగా యెపుడు వెగడు పఱచు గుమారా!**

భా. దేహమున నాటుకొన్న బాణములను యుక్తితో ఊడ బెరుకవచ్చును. నిష్ఠురముగా మాటలాడిన మాటలు మాత్రము ఏ ఉపాయము చేతనూ వెలికిదీయజాలము. పైగా ఎప్పుడు చూచిననూ వికారము గలిగించు చుండును.

**పెరవారలుండ ఫలముల**
**నరయంగా వారికిడక యాతడె మెసవన్**
**సరిగాదు విసపు మేతకు**
**సరియౌనని తలపు మానసమున గుమారా!**

భా. పలువురు ఇతరులు ఎదుట నుండగా ఫలములను వారికి ఇయ్యక తానే తినిన యెడల ఆ తిండి విషమును దినుటతో సమానమయినదిగా సరిగా భావింపవలెను. అనగా పండ్లను ఎదుటి వారికి పెట్టాలి. లేకపోతే ఆ తినటం విషం తిన్నట్లవుతుందని భావము.

తన సత్కార్యా చరణం
బున భాగ్యము వేగ వృద్ధి బొందు జగత్ప్రా
ణుని వర సాహాయ్యముచే
ననలం బెంతైన బెరుగు నయ్య కుమారా!

భా. వాయువు తోడ్పాటుతో అగ్ని ఎంత వృద్ధి పొందునో అట్లే తాను చేసిన మంచి కార్యముల సాయము చేతనే అదృష్టము త్వరగా వృద్ధి పొందగలదు.

# కుమారీ శతకము

ధన హీనుడైన గడు దు
ర్జనుడైన గురూపియైన జారుండైనన్
విను పాపియైన, నెప్పుడు
దన పతియే తనకు దైవతంబు కుమారీ!

భా. ఓ కుమారీ! ధనహీనుడైనను, కురూపియైననూ, దుర్మార్గుడైననూ తన మగడే తనకు దైవముగాని వేరు దైవము దైవముగాదు.

పతి కత్తకు మామకు స
మ్మతి గాని ప్రయోజనంబు మానగవలయున్
హితమాచరింపవలయును
బ్రతుకునకొక వంకలేక పరగు గుమారీ!

భా. ఓ కుమారీ! నీ భర్తకు, అత్తమామలకు ఇష్టములేని పనులను చేయకుము. వారికి మంచిని కలుగజేయు దానిని చేయుము. నీ నడవడికయందు లోపము లేకుండ ప్రవర్తింపుము.

పరపురుషులన్నదమ్ములు
వరుడే దైవంబు తోడిపడుచుల్ వదెనల్
మఱదంద్రు నత్తమామలు
ధర దల్లియ దండ్రియనియు దలపు కుమారీ!

భా. ఓ కుమారీ! నీ పతిని దేవుడుగాను, పరపురుషుల నన్నదమ్ములుగాను, వదినె మఱదండ్రను అక్క చెల్లెండ్రగాను, అత్తమామలను తల్లిదండ్రులు గాను యెంచుకొనుము.

కదుబుద్ధి గల్గి మెలగిన
బడతుక, పుట్టింటివారు పదివేల వరా
లిడుట కంటె గీర్తియగు ద
మ్మిడి లేకుండినను నేర్చిమెలగు కుమారీ!

భా. ఓ కుమారీ! పుట్టింటి నుండి చాల ధనము తెచ్చినను చెడునడవడికతో, నడచినచో యెవ్వరును మెచ్చరు. నీవు కానీ లేకున్నను మంచి గుణము గల్గి నడచినచో యెన్నో వేలిచ్చినదాని కన్న నీ తల్లి దండ్రులకు గౌరము కల్గును. కావున జాగ్రత్తగా నడుచుకొనుము.

గురు శుక్రవారముల మం
దిం గేహాళులందు లక్ష్మి తిరముగ నిలుచుం
గర గరిక నలికి ముగ్గిడి
గురుభక్తి మెలంగ బాయు గొదువ కుమారీ!

భా. గురు, శుక్రవారముల యిల్లు శుభ్రపరచి గడపలకు కుంకుమలు వ్రాసి పెద్దల యందు భక్తితోనున్న యింట లక్ష్మి తప్పక యుండును.

ఇంటగల గుట్టు నీపొరు
గింట రవంతైన దెలుపనేగకు దానన్
గంటసపడి నీవారలు
గెంటించెదరిల్లు వెడల గినుక కుమారీ!

భా. ఓ కుమారీ! నీయింటిలోని గుట్టు సుంతయైనను ఇరుగు, పొరుగు ఇండ్ల జెప్పితివేని నీ అత్తమామలు, భర్త మొదలగు వారు నిన్నావలకు పొమ్మందురు.

తొడవులు మిక్కిలి గలిగిన
కడుప్రేమన్ మగడు మిగుల గారామిడినన్
బడతుక పసుపుం గుంకుమ
గడియైనను విడువరాదు గాదె కుమారీ!

భా. ఓ కుమారీ! నగలెన్ని యున్నను, భర్త ఎంత ప్రీతితో చూచినను పసుపు, కుంకుమలు మాత్రమెప్పుడును ధరించుట మరువరాదు.

విసువగు పని తగిలిన యెడ
గసరకు సేవకుల మిగుల గాంతుని తోడన్
రొసరొస పూనకు మాడకు
మసత్యవచనంబు లెన్నడైన కుమారీ!

భా. ఓ కుమారీ! ఏదైన పని ఉన్నపుడు విసుగు కొనరాదు. నీ పరిచారికలను తిట్టకుము. మగనితో కలహింపకుము. ఏనాడును అబద్ధములాడకుము.

ధనవంతుడైన యప్పుడు
పెనిమిటి చిత్తం బెఱింగి పెండ్లాము మెలం
గును లేమి మెలగ నేర్చిన
వనితకు లోకమున వన్నె వచ్చు గుమారీ!

భా. ఓ కుమారీ! భర్త ధనవంతుడైనప్పుడు భార్య అణుకువతో భర్త మనసెరిగి ప్రవర్తించును. ఇది సహజము. కాని భర్త దరిద్రుడైననూ చులకన చేయక భర్త మనసునకు అణుకువగా గృహిణి ప్రవర్తించవలయును. అట్లు మెలగెడి గృహిణికి కీర్తి కలుగును.

**తల్లిదండ్రులన్నదమ్ములు**
**తుల దూగగనిమ్ము పసిడితోనైనను వా**
**రల యింట సతత ముండుట**
**వెలదికి మర్యాద గాదు వినవె కుమారీ!**

భా. ఓ బాలికా! తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఎంత బాగా ధనవంతులైనా, నీవు భర్తగారింట్లో ఆయన చెంతనే యుండుట నీకు మర్యాదను కలుగజేస్తుంది.

# భాగవత పద్యాలు

**రవిబింబం బుపమింప బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుడుదా బ్రహ్మాండమున్ నిండుచోన్**

భా. వామనుడు బ్రహ్మాండమంతయు నిండిపోతున్న ఆ సమయములో సూర్యబింబము క్రమక్రమముగా అతనికి గొడుగుగా, తర్వాత శిరోమణిగా, తర్వాత కర్ణకుండలముగా, కంఠాభరముగా ఆ తర్వాత బంగారు భుజకీర్తిగా, అటు తర్వాత కాంతులీనే కంకణముగా అనంతరము మొలలోని గంటగా, ఆపైన మేలైన కాలి అందెగా చివరకు పాదపీఠముగా పోల్చదగినదై ప్రకాశించినది.

(వామనుని త్రివిక్రమరూపాన్ని అద్భుతంగా వర్ణించి పోతనగారు రచించిన పద్యమిది)

**చేతులారంగ శివుని బూజింపడేని**
**నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని**
**దయము సత్యంబు లోనుగా దలపడేని**
**గలుగ నేటికి దల్లుల కడుపు చేటు**

భా. శివుని పూజించటం, హరిని కీర్తించడం, దయను, సత్యాన్నీ ధర్మాలుగా భావించడం జన్మ సాఫల్యానికి సాధనాలు. ఇవి లేనివారి జీవితం వ్యర్థం. వ్యర్థుడైనవాడు తల్లి కడుపున చెడబుట్టినవారంటారు. అంతేగాక అటువంటివాడు కడుపుచేటు గూడా!

**ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తోచు పో**
**లిక నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ**
**న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానా విధానూన రూ**
**పకుడై యొప్పుచునుండు నట్టి హరినే బ్రార్థింతు శుద్ధుండనై**

భా. సూర్యుడు ఒక్కడే. జీవులు అనేకమంది. ఆ ఒక్క సూర్యుడు ప్రతి జీవికి ఒక్కొక్కడుగా కనిపిస్తాడు. అసలు భగవంతుడొక్కడే! అతణ్ణి భావించే హృదయాలు అనేకాలు. ప్రతి హృదయానికి ఒక పరమాత్ముడు భాసిస్తాడు.

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు దెగిన తుది నలోకం బగు పెం**
**జీకటి కవ్వల నెవ్వడు**
**నేకాకృతి వెలుగు నతనినే సేవింతున్**

భా. పగలు, వెలుగు, రాత్రి, చీకటి. ఇదే నిత్యనైమిత్తిక భ్రాంతి. సృష్టి మొత్తం చీకటి. లోకాలు, లోకులు, లోకేశ్వరులు ఆ పెను చీకటికి మారు రూపులు. ఉన్నది ఒకే ఒక్క పరంజ్యోతి. అది ఒక్కటే అనశ్వరమైన ఆకృతి. ఆ వెలుగే శరణ్యము.

(ఇది గజేంద్రుని దృఢ సంకల్పాన్ని తెలుపుతూ పోతనగారు వ్రాసిన పద్యము)

లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె, బ్రాణంబున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవేదప్ప నితః పరం బెఱుగ, మన్నింపన్ దగున్ దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

భా. నా శరీరంలో బలం కొంచెం కూడా లేదు. ధైర్యం చలించిపోయింది. ప్రాణాలు అవి ఉన్న స్థానాలను వదులుతున్నాయి. మూర్ఛ వస్తూ ఉంది. శరీరమంతా అలసిపోయింది. శ్రమ అధికమౌతూ ఉంది. నీవే తప్ప మరే పరుణ్ణీ ఎరుగను. ఎవరూ నాకు లేరు. ఈ దీనుని మన్నించవలె. వరదుడవైన ఓ ఈశ్వరా! ఇకనన్నా రావా? కాపాడవా? నన్నునుగ్రహిస్తూ వచ్చి సంరక్షించు భద్రాత్మకా!

(కరిరాజు మొసలిచేత చిక్కి పోరాడిపోరాడి విసిగి, వేసారి, ఈశ్వరునితో గజేంద్రుడు మొరపెట్టుకొన్న పద్యం ఇది)

త్రిజగన్మోహన నీలకాంతి తను
  వుద్దీపింప బ్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలము
  పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద
  మతి సేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెదు వన్నెలాడు
  మదినావేశించు నెల్లప్పుడున్

భా. ముల్లోకాలనూ మోహింపజేసే నీలపుకాంతి శరీరాన్ని దీపింప జేస్తుండగా, ఉదయకాలపు లేత సూర్యుని కాంతివంటి ఎరుపును మించిన పసుపు వర్ణపు దుప్పటి ఆ శ్యామలాంగంపై రంజిస్తూ ఉండగా, నల్లటి ముంగురుల సమూహం ముఖ పద్మానికి మరింత సొగసును చేకూరుస్తూ ఉండగా,

సేవింపదగ్గ ఆకారంతో విజృంభిస్తూ మా అర్జునుడ్ని చేరవస్తున్న వన్నెకాడు నా మనస్సులో ఎపుడూ ఆవేశించి ఉంటాడు.

(అర్జునుడు నిర్మించిన అంపశయ్యమీద ఉత్తరాయణ పుణ్యకాలం కోసం ఎదురు చూస్తున్న భీష్ముడు, ఆ కాలం సమీపించగానే పరమానందంతో భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించినప్పటి పద్యం ఇది)

**మందార మకరంద మాధుర్యమున దేలు**
**మధుపంబు వోవునే? మదనములకు**
**నిర్మల మందాకినీ వీచికల దులదూగు**
**రాయంచజనునె? తరంగిణులకు**
**లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు**
**కోయిల సేరునె? కుటజములకు**
**బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక**
**మరగునే? సాంద్ర నీహారములకు**
**అంబుజోదరు దివ్యపాదారవింద**
**చింతనామృతపాన విశేష మత్త**
**చిత్తమేరీతి నిరతంబు జేరనేర్చు?**
**వినుత గుణశీల మాటలు వేయునేల?**

భా. మందారపు తేనె తీపిలో తేలుతూ చొక్కిన జుంటీగ ఆ మందారాన్ని వదలి ఉమ్మెత్త పూలకోసం పోతుందా? స్వచ్ఛమైన ఆకాశ గంగా తరంగాలలో ఉయ్యెలలూగుతూ ఆనందిస్తున్న రాజహంస ఆపావన సలిలమైన ఆకాశగంగను వదలి ఏటినీళ్ళ కోసం పరుగెత్తుతుందా? తీయ మామిడిలేచిగుళ్ళను తింటూ మైమరచే కోయిల రసాలాన్ని విడిచి తనకు అనువుగాని కాలంలో పూచే కొండ మల్లెను చేరుకుంటుందా? నిండు చంద్రుని పండు వెన్నెలకు ఆసక్తమై రమించే చకోర పక్షి ఆ చంద్రికను వదలి దట్టమైన పొగమంచులకు పోతుందా? అట్లే పద్మగర్భుడైన శ్రీ

మహావిష్ణువు దివ్యమైన పాదకమలామృతాన్ని పానం చేస్తూ ఆ మాధుర్యపు మత్తులో మునిగిన ఈ చిత్తం ఇతరాన్ని చేరడానికి ఎట్లా ఒప్పుకుంటుంది? వేయి మాటలెందుకూ? వినుత గుణశీలా!

(ఇది ప్రహ్లాదుడు తన గురువుగారైన చండామార్కులవారిని చూస్తూ తండ్రిగారైన హిరణ్యకశిపునకు చెప్పిన పద్యం)

కంజాక్షునకు గాని కాయంబు కాయమే?
  పవన గుంఫిత చర్మ భస్త్రిగాక?
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే?
  ఢమ ఢమ ధ్వని తోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే?
  తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
  తనుకుడ్యజాల రంధ్రములు గాక

చక్రిచింతలేని జన్మంబు జన్మమే?
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే?
పాదయుగముతోడి పశువుగాక

భా: కమలనేత్రుడైన విష్ణు నిమిత్తంకాని ఈ శరీరం అదీ ఒక శరీరమా? గాలితో నింపబడ్డ తోలు తిత్తిగాక! వైకుంఠుడైన హరిని పొగడని ముఖం అదీ ఒక ముఖమా? ఢమఢమ అంటూ మ్రోగే ఢక్కగాక! శ్రీహరి పూజ చేయని చేయి అదీ ఒక చెయ్యా? చెట్టు కొమ్మతో చేసిన తెడ్డుగాక! విష్ణుని చూడని కండ్లు అవీ కండ్లేనా? శరీరం అనే గోడకు ఏర్పరచిన గవాక్షపు తొర్రలుగాక! చక్రి చింతలేని జన్మ అదీ ఒక జన్మేనా? నీటి బుడగ గాక! విష్ణుభక్తి లేని పండితుడూ ఒక పండితుడా? రెండు కాళ్ళున్న గొడ్డుగానీ!

(పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు హిరణ్యకశిపునికి విష్ణుభక్తి ప్రభావాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యరాజమిది)

కాననివాని నూతగొని,
  కాననివాడు విశిష్ట వస్తువుల్
గానని భంగి గర్మములు
  గైకొని కొందఱు కర్మ బద్ధులై
కానరు విష్ణుగొందఱట
  గందుర కించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజో భిషిక్తులగు
  సంహృత కర్ములు దానవేశ్వరా!

భా. గ్రుడ్డివాడు గ్రుడ్డివాడిని ఆధారంగా తీసుకొని విశిష్టమైన మేలు పదార్థాలు చూడని విధంగా కొందరు కర్మలను ఆలంబనంగా చేసుకొని ఇంకా కర్మ బద్ధులౌతూ ఆ శ్రీ మహావిష్ణువును దర్శింపరు. దర్శింపలేరు. కొందరు ఏ పదార్థమందూ నాదీ అనే బుద్ధిని విడచి ప్రసన్నులై విష్ణు భక్తుల పాదపద ధూళిచేత అభిషేకింపబడుతూ, నశించిన సర్వకర్మలు గలవారై ఆ మహా విష్ణువును చూడగలుగుతారు.

(ప్రహ్లాదుడు హరి మహిమను ఎరుగలేని మానవుల స్థితిని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది. ఇది పోతనగారు వ్రాసిన పద్యం)

తను హృద్భాషల సఖ్యమున్
  శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చవముల్ సేవయు నాత్మలో
  నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల
  సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు
  దలతున్ సత్యంబు దైత్యోత్తమా!

భా. భగవంతుని పురస్కరించుకొని శరీరంలో హృదయంతో మాటలతో స్నేహం ఏర్పడవలె. అట్లే ఆ హరిని గూర్చి శ్రవణమూ, దాస్యమూ, వందనమూ, అర్చనమూ, సేవా, ఆత్మజ్ఞానమూ, సంకీర్తనమూ, చింతనమూ అనే ఈ తొమ్మిది భక్తిమార్గాలు. ఈ తొమ్మిది విధానాల్లో మనకు చేతనైన భక్తి మార్గంలో సర్వాత్మకుడైన హరిని నమ్మి సత్పురుషుడై ఉండడమే మేలని నేను నిజంగా భావిస్తున్నాను.

(కొడుకైన ప్రహ్లాదుడు తండ్రియైన హిరణ్యకశిపునకు చదువులలోని మర్మాన్ని చెప్పిన సందర్భములోని పద్యం)

**చిక్కడు వ్రతముల గ్రతువుల**
**జిక్కడు దానముల శౌచశీల తపములన్**
**జిక్కడు యుక్తిని భక్తిని**
**జిక్కిన క్రియనచ్యుతుండు సిద్ధము సుండీ!**

భా. నాశనంలేని శ్రీహరి వ్రతాలవల్ల కానీ, యజ్ఞయాగాది కర్మలవల్ల గానీ లభింపడు. అట్లే దాన ధర్మాల వల్లగానీ, శుచిత్వమూ, మంచి నడవడీ, తపస్సు మొదలైన ఉత్తమ లక్షణాలు కలిగి ఉండడంవల్లగానీ దొరకడు. అట్లని యుక్తితో, చాతుర్యంతో పొందుదామన్నా అతడు భక్తికి వశుడై దొరికినట్లు ఇతరాలైన ఏ పనులచేత కూడా పట్టుపడడు. ఇది తప్పదు సుమా!

(ప్రహ్లాదుడు తనతోటి రాక్షస బాలురకు జ్ఞాన, మోక్ష లక్షణాలను చెబుతూ అన్నిటికన్నా 'భక్తి' మోక్ష స్థానానికి దగ్గరిబాట అని బోధించే సందర్భంలో చెప్పిన పద్యం ఇది)

**ఇందుగలడందు లేడని**
**సందేహము వలదు చక్రి సర్వోప గతుం**
**డెందెందు వెదకి చూచిన**
**నందందే గలడు దానవాగ్రణి వింటే!**

భా. ఓ దానవ శ్రేష్ఠుడా! సుదర్శన చక్రధారియగు శ్రీహరి ఇక్కడున్నాడూ అక్కడలేడూ అనే సందేహమే వద్దు. ఆ హరి అన్నిచోట్లా ఉండేవాడూ. అందరూ ఆశ్రయింపదగినవాడు. వెదికి చూడని వారిదే తప్పుకానీ, ఎక్కడెక్కడ వెదికితే ఆయన అక్కడక్కడే ఉంటాడు. విన్నావా!

(శ్రీహరి సర్వవ్యాపకుడని అన్నిచోట్ల ఆయనను దర్శింపవచ్చని ప్రహ్లాదుడు తండ్రి వద్ద ప్రకటించిన పద్యం ఇది)

**మ్రింగెడి వాడు విభుండని**
**మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్**
**మ్రింగుమనె సర్వమంగళ**
**మంగళ సూత్రంబునెంత మది నమ్మినదో!**

భా. విషాన్ని మ్రింగేవాడు తన భర్త అనీ, మ్రింగేది ప్రాణాలకే ఎసరుపెట్టే విషమనీ తెలిసే సర్వమంగళమైన పార్వతీదేవి ఆపని ప్రజలకు మేలు చేస్తుందని భర్తను సరే మ్రింగులే అన్నది. ఆ సర్వమంగళ తన మంగళ సూత్రాన్ని ఎంత నమ్మిందో కదా!

(శివుడు హాలాహలాన్ని భక్షించేటప్పుడు, దానికి పార్వతి అనుమతి నిచ్చినట్లుగా భావిస్తూ, ఆమె పాతివ్రత్యాన్ని ప్రశంసిస్తూ పోతనగారు చెప్పిన పద్యం ఇది)

**ఇంతింతై వటుడింతయై మఱియు**
**  దానింతై నభోవీధిపై**
**నంతై తోయద మండ లాభ్రమున**
**  కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రుని కంతయై**
**  ధ్రువునిపై నంతై, మహర్వాటిపై**
**నంతై సత్యపదోన్నతుండగుచు**
**  బ్రహ్మాండాంత సంవర్ధియై**

**భా.** ఇంతింత పెరుగుతూ పొట్టివడుగు కొంచెం పెరిగినాడు. ఆ మీద కొంత సేపటికి మరింత పెరిగినాడు. మరింత సేపటికి ఆకాశ మార్గంపై ఎదిగి కానవచ్చినాడు. తర్వాత ఆకాశంలో మేఘ మండలానికి కొంత దూరంలో ఉన్నాడు. ఆ తర్వాత కాంతి వలయాన్ని దాటి, చంద్ర కక్ష్యను దాటి, ధ్రువ నక్షత్ర మండలాన్ని అతిక్రమించి, మహర్వాటిని గూడా అధిగమిస్తూ, సత్యలోకంతో సమానుడౌతూ, చివరకు బ్రహ్మాండం యొక్క అంతం వరకూ పెరిగినాడు.

(వామనుడు పెరిగిన విధాన్ని కండ్లకు కట్టినట్లుగా వర్ణించి పోతనగారు చెప్పిన పద్యం ఇది. మరచిపోలేని పోతన భాగవత పద్యాల్లో ఇదొకటి)

**ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై**
**నంసోత్తరీయంబుపై**
**బాదాబ్జంబులపై గపోల తటిపై**
**బాలిండ్లపై నూత్నమ**
**రాద్యం బెందుకరంబు గ్రిందగుట**
**మీదై నాకరంబుంట మే**
**ల్గాదే రాజ్యము గీజ్యమున్**
**సతతమే కాయంబు నాపాయమే**

**భా.** తొలుత లక్ష్మీదేవి కొప్పుపైనా, తర్వాత శరీరంపైనా ఆ తల్లి ఎదపై ఉన్న సన్నని ఉత్తరీయంపైనా, తామరల వంటి పాదాలపైనా, చెక్కిళ్ళ పైనా, పాలిండ్లపైనా కొత్త రీతిలో సింగారాలొలికే ఆ మహావిష్ణువు చేయి క్రిందై మీదైన నా చేతిది భాగ్యం కాదా? రాజ్యము, గీజ్యము శాశ్వతమా? ఈ శరీరం మాత్రం ఏ అపాయం పొందకుండా కలకాలం స్థిరంగా ఉంటుందా?

(అంటూ శుక్రాచార్యులవారికి బలిచక్రవర్తి చెప్పిన పద్యం ఇది)

కారే రాజులు రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూట గట్టుకొని
పోవం జాలిరే భూమిపై
బేరైనం గలదే శిబి ప్రముఖులు
ప్రీతిన్ యశః కాములై
యీరే కోర్కులు వారలన్
మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

భా. ఓ ఆచార్యా! ఎందరు రాజులు కాలేదూ, ఎన్ని రాజ్యాలు వృద్ధి పొందలేదు. వారంతా ఇప్పుడెక్కడున్నారూ? సంపాదించిన ధనరాశిని మూట గట్టుకొని వెంబడి తీసుకుపోగలిగిరా? ఈ భూమ్మీద వారి పేరన్నా వినబడుతుందా? శిబిచక్రవర్తి మొదలైన రాజశ్రేష్ఠులు ఎంతో ప్రేమతో కోరినవారి కోర్కెలు తీర్చలేదా? వారు గతించి ఎంతోకాలం అయ్యింది కదా? ఈనాటికీ వారిని మరచిన వారున్నారా?

(శ్రీహరి విశ్వవ్యాపకత్వాన్ని ఎరిగిన రాక్షస గురువు నీతిని పాటిస్తూ బలి చక్రవర్తికి తననూ, తన కులాన్నీ, తన రాజ్యాన్నీ కాపాడుకొమ్మని సలహా చెప్పగా దానవ రాజైన బలి చెప్పిన సమాధానమిది)

సిరికిం జెప్పడు శంఖ చక్ర
యుగముం జేదోయి సంధింప డే
పరివారంబును జేర
దభ్రగ్ర పతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిలము జక్క
నొత్తడు వివాద ప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు
గజ ప్రాణావనోత్సాహియై

భా. ఎప్పుడూ తనని విడిచిపెట్టి ఉండని లక్ష్మీదేవికైనా చెప్పడు తనకు విడిపోరాని శంఖచక్రాది ఆయుధాలనన్నా చేతిలో పట్టడు. ఏ పరివారాన్ని పిలువడు. గరుడవాహనాన్నైనా ఏర్పాటు చేయమనడు. చెవికి పెట్టిన అలంకారము మధ్యలో చిక్కిన కొప్పునన్నా సరిగా సరిచేసుకోడు. వివాదంలో మాటామాటా పెరిగి నీవానేనా అంటూ చేతబట్టిన శ్రీదేవి ముసుగు కొంగైనా విడువకుండా శ్రీహరి కరిరాజు ప్రాణాలను కాపాడే ఉత్సాహంతో బయలుదేరాడు.

(భక్తుడైన గజేంద్రుని రక్షించటానికి వెంటనే శ్రీహరి బయలుదేరిన ఆ హరి తొందరనూ, గజిబిజిపాటును చక్కగా వర్ణించి చెప్పిన పద్యమిది. పోతన విరచితము)

# శ్రీ ఆంధ్ర నాయక శతకము

ఆలు నిర్వాహకురాలు భూదేవియై
  యఖిల భారకుడను నాఖ్యతెచ్చె
నిష్టసంపన్నురాలిందిర భార్యయై
  కామితార్థదుడన్న ఘనత దెచ్చె
గమల గర్భుండు సృష్టికర్త తనూజుడై
  బహుకుటుంబకుడన్న బలిమిదెచ్చె
గలుష విధ్వంసిని గంగ కుమారియై
  బలిత పావను డన్న ప్రతిభదెచ్చె

నాంధ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతి గాని
మొదటి నుండియు నీవు దామోదరుడవె
చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్య భావ!
హత విమత జీవ! శ్రీకాకుళాంధ్ర దేవ!

భా. సమస్తాన్నీ మోసే భూదేవి అనే భార్యవల్ల అఖిల భారకుడనీ, గొప్ప సంపద గల్గిన లక్ష్మీదేవి అనే భార్యవల్ల కామితార్థ ప్రదాయకుడనీ, సృష్టికర్త అయిన బ్రహ్మ అనే కుమారుని వల్ల పెద్ద సంసారి అనీ, గంగానది అనే కూతురువల్ల పతితపావనుడని, ఇలా భార్య, పిల్లల వల్లే నీకు ప్రఖ్యాతి కలిగింది. నీవేకాదు. నీ కుటుంబమంతా గొప్పదే అనే స్తుతి ఈ నిందా పద్యంలో అంతర్లీనమై ఉన్నది.

**ఆడించెదవు బొమ్మలాట వాడును బోలె**
**సర్వచరాచర జంతువులను**
**కనుకట్టు గట్టె గారడీడును బోలె**
**మిధ్యాప్రపంచంబు తథ్యముగను**
**నేర్పుఁ దోతువు వేషధారియు బోలె**
**బహువిధ దేవతా భద్ర కళల**
**దెలివి మాన్పుదువు జక్కులవాని చందాన**
**బ్రజల సంపద్రంగ వల్లిఁజేర్చి**

**యిట్టివేకద నీ విద్యలెన్నియైన**
**నింక నేమిట ఘనుడవో యెఱుగరాదు**
**చిత్రచిత్ర ప్రభావ! దాక్షిణ్యభావ!**
**హతవిమత జీవ! శ్రీకాకుళాంధ్రదేవ!**

భా. జంగమ స్థావరమైన జీవకోటిని తోలుబొమ్మలాడించు వానివలె ఆడిస్తావు. మిథ్యా జగత్తును కనుకట్టువానివలె తథ్యమనునట్లుగా కనిపింపజేస్తావు. వేషగానివలె వివిధ దేవతల అంశలతో కనిపిస్తావు. మాంత్రికుని వలె లోకులను సంపద అనే ముగ్గు మధ్యలోకి ఆకర్షించి వివేకాన్ని నశింపజేస్తావు. అసంఖ్యాకములైన నీ విద్యలన్నీ ఇలాగే మోస పూరిత విద్యలు.

ఇంకా ఏయే విద్యలందు నీవు నేర్పరివో తెలిసికొనుట మా వల్లకాదు. బహువిచిత్రములైన మహిమలు కలవాడా! దయా భావము గలవాడా! శత్రు సంహారకా! శ్రీకాకుళమున వెలిసిన ఆంధ్ర నాయకుడనే పేరు గలిగిన విష్ణుమూర్తీ!

**అఖిల పోషకుడవ న్యాఖ్య మాత్రమె కాని**
**కర్తవు నీవె భోక్తవును నీవె**
**యక్షరుండ వను ప్రఖ్యాతి మాత్రమె కాని**
**చర్చింప వేరొండు సాక్షి గలదె?**
**సుగుణాబ్ధివని నిన్ను స్తుతి యొనర్చుటెగాని**
**నిర్గుణుండెవ్వడు నీకు మించ?**
**విశ్వాత్ముడ వటంచు వినితుంచుటయె కాని**
**చొచ్చి నిన్నెవ్వడు చూచినాడు?**

**వినికిడియెగాని నిన్ను నీ విశ్వములను**
**మొదలెఱుంగదురే నిజంబునకు జెపుమ**
**చిత్ర చిత్ర ప్రభావ! దాక్షిణ్య భావ!**
**హత విమతజీవ! శ్రీకాకుళాంధ్ర దేవ!**

**భా.** అఖిల పోషకుడవని పేరేగాని నీవే కర్తవు. నీవే భోక్తవు. శాశ్వతుడు అను కీర్తి మాత్రమేగాని అందుకు మరొకడు సాక్షి లేడుగదా! సుగుణుడు అని నిన్ను స్తుతిస్తారు. కాని నిన్ను మించిన నిర్గుణుడెవ్వడు? విశ్వాత్ముడు అని నిన్ను వినుతిస్తారు? కాని అవునోకాదో ఎవరికి తెలుసు? ఇదంతా ఎవరో చెప్పగా విన్నది మాత్రమే. నిజానికి నిన్ను గురించి ఈ విశ్వమును గురించి అసలు ఎవరికీ తెలియదు కదా!

భిల్లాంగనా దంత పీడిత ఫలభుక్తి
హేయంబు దోచలే దింత నీకు
సంక్రంద నాత్మజ స్యందన సారధ్య
మెరుసుగా దోచలే దింత నీకు
గోపాల కానేక గోవత్స పాలనం
బెగ్గుగా దోచలే దింత నీకు
వ్రజ బాలికా ముక్త వస్త్రాపహరణము
హీనమై తోచలే దింత నీకు

నుచ్చనీచంబు లెఱుగక యిచ్చజేయు
చేష్టలివి భక్తహితమతి జేసి తండ్రు
చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్య భావ
హత విమత జీవ శ్రీకాకుళాంధ్ర దేవ!

భా. శబరి ఎంగిలిచేసిన పండ్లు తింటివి. అర్జునుని రథము నడిపితివి. ఆలమందను మేపితివి. గోపస్త్రీల చీరలను దొంగిలించితివి. ఇవి నీవు చేయదగని హీన కార్యములు. నీకు ఉచ్చనీచములు తెలియవు. అయిననూ కొందఱు ఈ పనులు భక్తుల మీది ప్రేమతో చేసినవని సమర్థించుచున్నారు. అది నిజమే (అని నిందాముఖమున స్తుతి).

నాగలి రోకలన్నకు నిచ్చి శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు
తాటి టెక్కెంబు కోల్తల పెద్దకెత్తించి
గరుడ ధ్వజంబీవు గట్టినావు
వెలరాని కరవోని వలువ జ్యేష్ఠున కిచ్చి
కనకాంబరం బీవు గట్టినావు
మద్యమ గ్రజునకు మత్తిల ద్రావించి
జున్నుబాల్ పెరుగీవు జుట్టినావు

తగవరివె యన్నదమ్ముల ధర్మమీవె
తీర్చవలెగాని మఱియొండు తీర్పగలడె
చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్యభావ!
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్ర దేవ!

**భా.** నాగలి, రోకలి అన్నగారైన బలరామునకిచ్చి, శంఖ చక్రాది పంచాయుధములను నీవు పట్టినావు. యుద్ధములో తాళ ధ్వజము అన్నకు ఎత్తించి గరుడ ధ్వజమును నీవు కట్టినావు. విలువలేని నీలాంబరమును అన్నగారికిచ్చి, పీతాంబరమును నీవు ధరించినావు. అన్నగారికి మద్యపానమును బాగా త్రాగించి, మత్తు గొనునట్లు చేసి నీవు మాత్రము పాలు, పెరుగు, జున్ను జుర్రినావు. అన్నదమ్ముల నడుమ ఉండవలసిన న్యాయమును నీవే దిద్దవలెనుగాని మరియొకనికి చేతగాదు. తీర్చలేదు.

# ఇతర పద్యాలు

**తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతంబూనితిన్ నీవు నా**
**యుల్లం బందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబుల్ శో**
**భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్! జగన్మోహినీ!**
**పుల్లాబ్జాక్షి! సరస్వతీ భగవతీ! పూర్ణేందు బింబాననా!**

**భా.** అమ్మా! నిన్ను స్మరిస్తూ పుస్తకం పట్టుకున్నాను. నీవు నా బుద్ధిలో, మనస్సులో నిలిచి మూగతనం లేకుండా చేసి, నంగి, నత్తిమాటలు రాకుండా చేసి మంచి ఉచ్చారణా శక్తిని కలిగించు. నీకు జగత్తును మోహింపజేసే శక్తి ఉన్నది. నీవు విచ్చుకున్న తామర విరి వంటి కన్నులు గలదానివి. నీవు కాంతిమతివి. ప్రవహించే గుణం గల దానివి.

**ధీరోదార గుణంబులు**
**కారణ జన్మునకు వేతే కరప వలెనా**
**ధారుణిలో టెంకాయకు**
**నీరెవ్వరు పోసిరయ్య నిట్టల హరియా!**

భా. ధైర్యం, ఔదార్యం అనే గుణాలు జన్మతః మనిషికి అబ్బుతాయి. టెంకాయలో నీరెంత సహజంగా పుట్టుకొస్తుందో ధైర్యం, ఔదార్యం అనే గుణాలు కూడా పుట్టుకతోనే వస్తాయి.

– నిట్టల హరియప్ప

**వాసనలేని పువ్వు, బుధ వర్గంబులేని పురంబు, నిత్య వి**
**శ్వాసము లేని భార్య, గుణవంతుడు గాని కుమారుడున్ సదా**
**భ్యాసములేని విద్య, పరిహాసములేని ప్రసంగ వాక్యమున్**
**గ్రాసములేని కొల్వు కొఱగానివి పెమ్మయ సింగధీమణీ!**

భా. వాసన లేని పూలు, పండితులు లేని ఊరు, విశ్వాసహీనురాలైన భార్య, గుణవంతుడుకాని కొడుకు, చక్కని అభ్యాసంలేని విద్య, పరిహాస కుశలత (మాధురీ, మహిమలు లేని) సంభాషణ, జీతంలేని ఉద్యోగం పనికి మాలినవి.

**ఉద్యోగ మొదవి నప్పుడు**
**సద్యోమదమది మొదవి పూర్వ సరసత లుడుగున్**
**విద్యావంతులకైనను**
**విద్యా విహీనునకు వేతె వివరంబేలా!**

భా. ఎంత చదువుకున్నవాడికైనా ఉద్యోగం (అధికారం) లభిస్తే అంతకు ముందు అతనిలో ఉన్న సరసత, స్నేహం ఉడిగిపోతాయట. ఇక చదువు లేని వాడికి అధికారం వస్తే ఏం జరుగుతుందో వేరే వివరించవలసిన పనిలేదు కదా!

**నుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత**
**వ్రత! యొక బావిమేలు మఱిబావులు నూఱిటికంటె నొక్క స**
**త్క్రతువదిమేలు తత్క్రతు శతంబున కంటె సుతుండు మేలు త**
**త్సుత శతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు సూడగన్**

**భా.** మంచి నీటితో నిండిన చేద బావులు నూరిటి కంటె ఒక దిగుడు బావి మంచిది. అట్టి వంద దిగుడు బావుల కంటె ఒక యజ్ఞము మంచిది. అట్టి వంద యజ్ఞాలకంటె ఒక పుత్రుడు మేలు. అట్టి పుత్రులు వంద మంది కంటె ఒక సత్యవాక్యం మంచిది.

(సత్యము యొక్క గొప్పతనాన్ని వివరించి చెప్పు సందర్భంలో శకుంతల దుష్యంతునకు చెప్పిన పద్యమిది.)

నన్నయ ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం, చతుర్థాశ్వాసం, శకుంతలోపాఖ్యానం నుండి ఇది గ్రహించబడినది.

**అవనీ చక్రము పాద ఘాతహతి నల్లాడంగ నత్యుచ్ఛ భై**
**రవ హుంకార రవంబునన్ వియద గారంబెల్ల భేదిల్ల బాం**
**డవ కౌరవ్య గదా విఘట్టన మకాండ ప్రోత్థమై భావి పాం**
**డవ కౌరవ్య రణాభి సూచన పటిష్టం బయ్యె ఘోరాకృతిన్**

**భా.** భీమ దుర్యోధనుల పదఘట్టనలచే భూమి దద్దరిల్లినది. మహా భయకంరమైన హుంకార ధ్వనులతో ఆకాశము మారుమ్రోగినది. భీమ దుర్యోధనుల గదా యుద్ధ ధ్వని భవిష్యత్తులో జరుగబోవు కౌరవ పాండవుల భారత యుద్ధానికి బీజంగా నిలచింది.

(ఈ పద్యంలో భీమ దుర్యోధనుల గదాయుద్ధ విశేషము వర్ణింపబడింది. వారి వారి విద్యా కౌశల ప్రదర్శనము వెనుక వారివారికి గల క్రోధమును వ్యక్తపరచినది.)

**నన్నయ - కుమారాస్త్ర విద్యా ప్రదర్శనము**



యాకుందేదు! తుషార హార ధవళా!
యా శుభ్రవస్త్రాన్వితా! యావీణా వరదండ మండితకరా!
యాశ్వేత పద్మాసనా! యా బ్రహ్మాచ్యుత
శంకర ప్రభృతి భిర్దేవైస్సదా
పూజితా! సామాంపాతు సరస్వతి
భగవతి! నిశ్శేష జాడ్యాపహా!